శ్రీ

# శతకస్తబకము.



గ్రంథకర్త:
భువనగిరి విజయరామయ్య బి. యే.,
లోకల్ ఆడిటాఫీసు, గుంటూరు.

మొదటి కూర్పు
1000 ప్రతులు.



1936

వెల 0-4-0.

శ్రీ

# శతకస్తబకము.




గ్రంథకర్త:

భువనగిరి విజయరామయ్య బి. యే.,

లోకల్ ఆడిటాఫీసు, గుంటూరు.



మొదటి కూర్పు

1000 ప్రతులు.





1936


వెల 0-4 0.

శ్రీ వేంకటేశ్వర ప్రభవేనమః.

# శతకస్తబకము.

# శ్రీమద్వేంకటేశ్వరప్రభుశతకము.



లక్ రాజిలు సర్వజీవముల నిర్జీవంబుల న్నిండి శ్రే
యోలాభంబులఁగూర్చు శక్తిమయనిత్యోత్సాహివౌ నిన్ను నే
లా? లాఁతుల్వలె చీఁకి దీనసలకుక్ శ్లాఘింప నాసాదని
వ్యాలేఖ్యప్రభనోలలాటపదము దేవా! వేంకటేశప్రభూ!

శా॥ శ్రీవాణీగిరిజాస్వయంప్రభువసత్క్షేమక్రియావృత్తి త
ద్భావోల్లాససుఖానుపాలకమనోవాక్కాయకర్మాళి ని
త్యావాసంబునొసర్పఁ జిత్రతరవాహ్యాళిక్ జగాపొల్చు దే
వా! వాక్కాయమనఃప్రబోధమిడరావా? వేంకటేశప్రభూ!॥ 2

శా॥ శ్రీనారాయణ! వాసుదేవ! కరుణాసింధూ! హృషీకేశ! శం
భూ! నిత్యోత్సవసంవిధానజనతాంహోధ్వాంతచండార్క! ని
త్యానిత్యాదివిభేదశూన్య! గుణమాన్యా! కేశవా! శ్రీనృసిం
హా! నిర్వాణపదా! నతోస్మి; శివరామా! వేంకటేశప్రభూ!॥ 3

మ॥ భువిజన్మించినతోనె నీదయినదాపున్వీడి నానాఁటి కీ
తెవులుంగొంటుమరాశలందవిలి యొంతేదవ్వుచన్నాఁడ; నా
కెవరయ్యా? నినుఁగ్రమ్మఱక్ దలఁచియు సాహిత్యంబుఁ జేకూర్పు నో
శివనారాయణ! నీవుదక్క బుజాభాషీ! వేంకటేశప్రభూ!॥ 4

మ॥ కరిహస్తక్రియ కొండయీఁగవలెఁ దోల్కాడైనసౌదామనీ
త్వరతో నిల్కడలేక సంతతసమస్తవ్యాపకత్వంబుతోఁ
దిరుగుక్ జిత్త మనస్యమై వెలయువృత్తి న్నిన్ను సేవించు సం
బర మేలాగులభించునాకు శివరామా! వేంకటేశప్రభూ!॥ 5

మ॥ అతిసంచారిణియైనచిత్తమున నేకాగ్రత్వము న్గూర్చునా
యతనం బేటి కనంతరూపివగునీయం దెప్పుడున్ద్రిప్ప స
మ్మతమౌచుండఁగ నైత యానపదమై మాధ్యస్థము న్గూర్ప భా
వతరంగంబు లనంతవైఖరులవీనన్ వేంకటేశప్రభూ!॥ 6

మ॥ వివశత్వంబున నిద్రవోవు నెడ మావీర్యంబు మాప్రజ్ఞ గా
వవుగా? మమ్ము నిరాపదన్ నిలుపఁ బ్రాపై సాఁకు నీప్రేమగా
కెవరయ్యా? పొడసూపి మావలన తండ్రీ! యన్న సంబోధనన్
శివనారాయణ! పొందఁగాఁదగదొకో శ్రీవేంకటేశప్రభూ!॥ 7

శా॥ ఏలోకంబుల జన్మముల్జరిగెనో యింకెంతఁగానున్నవో
యీలో జన్మమెలేనినీపదము మాకీరానిచో నీకళా
లీలాలాపన నిత్యమె వెలయు కేళి న్మమ్ము నాడించి హం
సా! లోలోపలఁ జేర్చుకొమ్ము శివరామా! వేంకటేశప్రభూ!॥ 8

శా॥ మాబండాలమెఱుంగవే? వ్యసనహింసాసమ్యగాకృష్ట మ
య్యా! బాబా! బతిమాలుకొందుము తదీయంబున్ పహాగొట్టి మా
మాబత్తెంబును ధర్మమార్గమున సంపాదించి వేవేగ మ
మ్మాబాధన్ దొలఁగించి కైకొనఁగ రమ్మా! వేంకటేశప్రభూ!॥ 9

మ॥ తనవుల న్శోకమునైనఁ గ్రుడ్డి తనయుంతన్నేరఁ డాచుట్టుప
ట్టువిరాజిల్లు సమస్త మట్టులనె చుట్టున్ లో నవిచ్ఛిన్న బాం
ధవదాక్షిణ్యాతమించునిన్నుఁ దెలియన్రానీక మాభాగ్యం బహో!
శివనారాయణ! మేలుకొల్పఁగదవే! శ్రీవేంకటేశప్రభూ!॥ 10

శా॥ స్వామీ! నీనుతి నూహ సేటికొకచోఁ బ్రాప్తించ వోయయ్య నా
నామాధుర్యముల న్గల్కు కల్పన లనంతశ్రేణులై పర్వని
మ్మా! మాయీకృతిలో క్షణక్షణవినూత్నాలంకృతు ల్దివ్యశం
పామాలావళులై చెలంగ శివరామా! వేంకటేశప్రభూ!॥ 11

మ॥ నను వీడెన్నటికైన నెన్నకొనునైన న్వీడనో యంచుఁ బ
ట్టను నీవుండఁగ నంతకంతకుఁ బ్రపంచప్రాప్తబుద్ధీంద్రియం
బును సుధ్యాసుఖజాగరూకుఁడగుచుండున్జీవి హా! హేతువుం
డిన సద్భావిని మందలింపఁగదె తండ్రీ! వేంకటేశప్రభూ!॥ 12

మ॥ ఎవరేరీతిఁదలంపనీ కొలువని మ్మేకాలము న్వారి కు
త్సవముల్గూర్పనె చూచుచుందెదవు వాత్సల్యంబునిండారుని
స్నవుఁగాదంచనువారిభాగ్యమున కోరా! మేరయుంగల్గునే?
శివనారాయణ! భూతపంచకనివాసీ! వేంకటేశప్రభూ! ॥ 13

శా॥ నీవేనేనని నేనెనీవనుచు నేనేచెప్పుకున్నంత నా
నావిశ్వోత్తరమైననీప్రతిభ యీనాయందుఁ గన్పట్టునే?
దావాగ్నిన్విడురవ్వ లాఁటినెయొకింతల్; మాకు నీశక్తని
యావేశంబునఁగాకయున్నె? శివరామా! వేంకటేశప్రభూ! ॥ 14

మ॥ వదలన్రానిభవత్పదార్చనము దేవా! మానఁగాఁజాల నే
యదనం దేమఁటు దోప్పునో యెఱింగి చాయంబోలి వర్తింపుని
నె దయ న్నాకుఁ బ్రబోధ మీవలయు నో విశ్వేశ! కాలత్రయా
దదశావర్జితసత్పదా! ప్రణవనాదా! వేంకటేశప్రభూ! ॥ 15

మ॥ ఎవియో యెన్నియొ పాపపుణ్యముల నాయీజన్మ నేఁజేసియుం
టి విచారింపఁగ జ్ఞప్తిచాల దిఁకవానింగూర్చివాదేల? త్వ
త్సవిధంబాత్మకుఁగల్గ నన్నిటఁ బవిత్రంబౌటకున్లోటు? శ్రీ
శివనారాయణ! ఆర్తరక్షణవిభాసీ! వేంకటేశప్రభూ! ॥ 16

శా॥ కూడుంగుడ్డయు లేనివా రలమటల్ ఘోషింపఁగా నున్న నా
రాడల్ వేడుక లేవిలేవనుచు నారాటంబుతోనుంట రో
జేఁడా యీదురవస్థ మాకృతమొ నీసృష్టిస్వభావంబొ? కొం
డాడన్నే మిఁకసంస్కరింపు శివరామా! వేంకటేశప్రభూ! ॥ 17

శా॥ గట్టుంజేరిన నీటితుంపురులు శీఘ్రంబెండి నీ మాపుగా
నట్టుల్నీపరతత్వమున్వదలి యుందందేగు నీయాఁబువుల్
పుట్టంజేరునొ గుట్టఁజేరునొ విహాపుజ్జెంది నిజ్జేరునో?
పట్టై యాదుకొనంగరావె! మము దేవా! వేంకటేశప్రభూ! ॥ 18

మ॥ తెవుఁగో మంచియొ నీకయిన్విడక నాదే తెల్విపొమ్మంచు విం
తవిధి న్గోర్కెఫలింప నాఫలము నీ దాక్షిణ్యజంబైనన్
స్వవశాస్త్రంబని విట్టవీఁగి యిపుడా సత్యంబుఁగన్గొంటి నో
శివనారాయణదేవ! సత్వగుణరాశీ! వేంకటేశప్రభూ! ॥ 19

శా॥ నిన్నేనమ్మినవారి వ్రేళ్లపయిన న్లెక్కింపఁగావచ్చు స
న్నన్నా! నమ్మిన లోటులేదనుట సమ్యగ్విశ్రుతం బేటికో
యున్నామిచ్చుటఁ గోట్లుకోట్లుగను మాయుద్యోగ మిట్లేచరిం
పన్నిష్ఠితమెజన్మజన్మ? శివరామా! వేంకటేశప్రభూ! ॥ 20

మ॥ ఏ నెంగుఁగర్ గౌరవహానిలే దెచటవాదున్బాధయుర్ రాదు దు
ర్వ్యసనాలోచనకింతచోటిడదు నిత్యానందముంగూర్చు న
భ్యసనాన్ర్మింబయిదక్కు నీస్మరణ భక్త్యావేశ మొందించుమే
లిమ్మసమాచారమెటులింగి నీకయితిసుమ్మీ! వేంకటేశప్రభూ! ॥ 21

మ॥ అప్పుడుగాము లైనచేతనున్నట్టుల వీడాటాడురాయంచునర్
ని పురంగా లేటికి నేర్చినేరక విపన్నత్వంబుచే నిష్పృహై
న విశిష్టమ్మును వ్యాజహీనమగు నీనాసొంపుదాక్షిణ్యము
న్నివనారాయణదేవ! నిక్కముగఁగంటిన్ వేంకటేశప్రభూ! ॥ 22

శా॥ ఎంతో వేడుక మక్కువంగొలుప నేయేబొమ్మలో పెట్టె సం
భ్రాంతంబౌమన ముంచునిల్పి నినునాహ్వానించి మేల్పూజ ని
న్నెంతో పింపఁగఁజేయు కౌతుకముల న్నాగించుచున్నాము స
ర్వాంతర్యామివి చిత్తగింపు శివరామా! వేంకటేశప్రభూ!॥ 23

శా॥ ఈ మెం పుస్తలవన్నమాటఁగాని తానే సుష్కృతుల్జేసియు
న్నీ వేచేసినటు ల్గణించుకొను దుర్నీతిం జడుం డాకృతి
ప్రావిఖ్యాతఫలానుభూతినయినన్ భావించునో లేదొ తా
నే వృత్తింగొనుచో స్వతంత్రుఁడను దానిన్ వేంకటేశప్రభూ! ॥ 24

శా॥ నీలావణ్యము మాశిశుత్వదశల న్నీహాయి మాతుష్టి నీ
లీల ల్మానడవళ్లఁ జూచుకొనుచుం గ్లేశంబుల న్విస్మృతిం
దూలందోలి భవద్విచిత్రకళ లింపున్లేవొకో యంచుమ
య్యా! లక్ష్యంబిడి తేర్పరానె శివరామా! వేంకటేశప్రభూ! ॥ 25

మ॥ నవల ల్నాటకము ల్సినీమలు పురాణంబు ల్ప్రబంధాదు లే
కవులు ల్వ్రాయఁగలేని వైఖరిరసోత్కర్షన్ మహాసూత్రధా
రవి కల్పింతువనుక్షణం బభినవశ్రీ లోకరంగంబుల
న్నివనారాయణ! అప్పుతామితవధానీ! వేంకటేశప్రభూ! ॥ 26

మ॥ ఇవియిట్లైననులెస్సనాకనుచు నొక్కింతేనుభావింప న
వ్యవధానంబుగఁ దద్విధానమొనరింపంజాలినా వౌర! యీ
వివరం బాత్మ నెఱింగియున్న ననఁ గావేడ్క న్దిగంద్రోసి యో
శివనారాయణ! కోరనే యమృతరాశిన్ వేంకటేశప్రభూ!॥ 27

శా॥ ఏమయ్యా! మొదలుంగొన న్వాళ్ళను వేమీనీకు? లేకున్న ని
యీమాసృష్టి నవేల? నందెసఁగునీ కేలాగు లేకుండు? నిం
దేహోగుట్టని మిణ్కరించెదము నీయీమాయావిలాసంబులన్
వ్యామోహంబిడ కూఱడింపు శివరామా! వేంకటేశప్రభూ!॥ 28

శా॥ ఓవిశ్వంభర! పాపకాననకృశానూ! ఆదిమధ్యాంతశూ
న్యా! వృద్ధిక్షయవర్జితా! చిరతరానందప్రదాతా! కృపా
బ్ధీ! విష్ణూ! సకలస్వతంత్రపదవర్తీ! సచ్చిదానందమూ
ర్తీ! వేదత్రయరూప! భో! శరణు తండ్రీ! వేంకటేశప్రభూ! ॥ 29

మ॥ అవిలేవో! యివిలేవు తెమ్మనుచు నిన్నర్థించువా రొక్కెడన్
సవిమర్శన్ గడుఁదృప్తినో విసివియో చాలింత్రు యాచించు టీ
వౌ! విలాసంబుగ సుంతయున్వొసువ కీవుల్ కీవివర్ధింతు వో
శివనారాయణ! దాతృతాగ్రపదభాజీ! వేంకటేశప్రభూ! ॥ 30

మ॥ కనువాని న్వినువానిఁ జేయుపనులన్నానీ విచారించునా
నినిఁగానీ నినుఁగా స్మరింపవలెన న్సిద్ధాత్మతోఁ బూనుకొం
దునుమున్మాదటఁ గాని తన్మయతనుండుఁ దత్క్రియావృత్తి నా
మనము న్నీదెసఁద్రిప్పుకొమ్ము శివరామా! వేంకటేశప్రభూ!॥ 31

శా॥ ప్రేమన్ జూపెడుబంధుమిత్రగురుసద్బృందంబులంగాంచి లో
నీమంచిన్గణియింతునా? విరసతన్వేధించుచోరారిస
స్తోమంబుంగని నీమక్రూరతకునై దుఃఖింతునా? యేల నీ
వీమాడ్కిన్ ననుఁజుట్టుముట్టెదవు స్వామీ! వేంకటేశప్రభూ!॥ 32

మ॥ దివమెల్లన్ దమపొట్టకక్కఱతి నెందేఁజాకిరిం జేయుమా
నవు లేవేళనొ యెట్టికష్టములనో "నారాయణా! రావె కా
వవె" యం చార్తి వచించినంతటనె నీభక్తాళిఁగాఁ జూతు వో
శివనారాయణ! ఆర్తరక్షణవిభాసీ! వేంకటేశప్రభూ! ॥ 33

మ॥ కనులో నిన్గనుఁగోఁదలంచు తనువో కౌఁగింటెనాసించు ని
న్వీన వీనుల్గమకించు నిగ్గలియ నువ్విళ్లూరుఁ జిత్తం బను
క్షణము న్నీవు ప్రసన్నతన్ దఱిసి యీసౌభాగ్యము ల్సచ్చిదం
శనుగూర్పన్ నినుఁబోల్ప లేము శివరామా! వేంకటేశప్రభూ!॥ 34

మ॥ భయమున్గొల్పదు భీతిఁజెందదవు సంపద్భాజివైయుందు పే
దయునైయుండెదు సౌఖ్యమొందెదవు బాధన్గుందుచుం దబ్ధిలోఁ
బయనంబేగెదు గాలినాడెద వాకేపర్యాయ మయ్యారె! ని
ర్ణయము న్నే? యిటనీవిచిత్రతరచర్యల్ వేంకటేశప్రభూ!॥ 35

మ॥ పవలేమో పలుపాట్ల భుక్తివెలయింపం జెల్లు ఱేయెల్ల ని
ద్రవరించున్ గలకాల మీనియతి చక్రంబట్టులం దొర్ల దొ
ర్ల విధిప్రేరణ కాయమేతొలఁగు నౌరా! భక్తి యిందెప్పుడో?
శివనారాయణ! చక్రపాణి! పరమేష్ఠీ! వేంకటేశప్రభూ!॥ 36

మ॥ గిలకన్నాగడిభార మంతవడితోఁ గేలొక్కట న్లాగఁగాఁ
దలమే? త్వత్పదభక్తియన్గిలకమీఁద న్సంస్మృతీభార మె
ట్టులోలాగ న్గమకించు మాకుఁ జెవుకట్టు ల్మెల్త్వరన్గూర్ప సం
దులఁ జిల్కన్గదె నీకృపారసముచిందుల్ వేంకటేశప్రభూ!॥ 37

శా॥ నీతోవైరముఁబూని యేకడలనేనిన్ సాటిలేరన్న వి
ఖ్యాతి న్గాంచిన హేమకశ్యపదశాస్యగ్రామణు ల్మాకు మే
ల్దూతల్గాఁగఁ దదుగ్రచర్య పెనునీతుల్తెల్పు పాఠంబుఁగా
మాతండ్రీ! విధియించినావె? శివరామా! వేంకటేశప్రభూ!॥ 38

మ॥ సకలవ్యాప్తుని నిన్నుఁ గొల్వవలయు న్సత్యంబుపో; సాధుసే
వకు సౌముఖ్యముఁదాల్చుచిత్త మెపుడున్ బాధించు దుష్టారిసే
వకునై తూఁగదు; వారిదౌష్ట్యమును దుర్వ్యాపారతన్ గూల్చుటే
ప్రకటారాధనఁగా గణింపవలె నప్పా! వేంకటేశప్రభూ!॥ 39

మ॥ నవనీతంబునుమించి మెత్తనయియుండుంబోలు నీప్రేమ దు
ర్వ్యవసాయంబుల సంచరించుకుజనవ్రాతంబుల న్గోపగిం
పవు సంపద్విభవంబు వారలకె నింపాజూతు తన్ముక్తికిన్
న్శివనారాయణ! ప్రేమమార్గమనుకుంటిన్ వేంకటేశప్రభూ!॥ 40

శా॥ మాతో నేకలిగంజియో కొనుచు మామాసంపదాపత్తి నెం
తోతోఁడై వెలయింపఁ గర్కుటితికద్దో నీకు? ప్రేమప్రభా
జాతావ్యాజకృపస్ఫురింతు, సకలాశాచక్రవర్తీ! జగ
న్మాతృస్థానశుభప్రవర్తి! శివరామా! వేంకటేశప్రభూ! ॥ 41

శా॥ యోగానందసమాధిసంజనితదివ్యోంకారసంచారవి
ద్యాగానామృతపానసంతతిసమాధానా! తదోంకారసం
జ్ఞాగర్భీకృతసర్వనాదబహుళానందానుసంధాన! ని
త్యాగూఢీకృతసంవిధాన! పరమాత్మా! వేంకటేశప్రభూ! ॥ 42

మ॥ "అవురా! యేనుఁగుపుర్లు పైఁటతవుల్తై యార్తి న్బడిన్వచ్చునీ
యువతిన్ సైతము విస్మరించి" తన "నోహో! సుంతభక్తార్తి నా
చెవులన్సోఁకిన నన్నె నేమఱతు" నన్నిద్ధప్రతిజ్ఞాంశ మో
శివనారాయణ! తారకాణయిడవే! శ్రీ వేంకటేశప్రభూ! ॥ 43

శా॥ లేదయ్యా! వెనుకన్ జభోగముల, నిర్లేపత్వముం జెందఁగా
రాదయ్యా! మనసొక్కమాఁదడుగు, సంరంభంబుతో నెప్పుడు
న్వాదయ్యా! కలదానికై, యెపుడు నిగ్రాంత్యించుట లోపరను
న్మాదం బెత్తుట కేసుమయ్యా! శివరామా! వేంకటేశప్రభూ! ॥ 44

వా॥ సేవే మాయెడనుంట నిక్కము యిస్సీ సేవయే మాకు క్షే
మావిష్కారపథంబు; మంటను గణింపంబింపగ్ని యేయున్న జ్వా
లావృత్త్యాశ్రయపుష్టి నేకద రస ల్భాసిల్లుటల్ దేవదే
వా! వేదాంతశుభస్వభావ! కనరావా! వేంకటేశప్రభూ! ॥ 45

మ॥ "అవధారంచుఁ బిపీలికాదివిధిపర్యంతంబుఁ గావించు పె
న్రవళి న్నాచిఅనుకూఁయి నిద్దటియఁబోనా!" యంటినిన్నాళ్లు ల
వ్యవధానంబుఁగఁ గోర్కెఁ తొటఁగన నీడ క్లెందు నెవ్వారితో
శివనారాయణ! నీవు వెల్గు టగుపించేన్ వేంకటేశప్రభూ! ॥ 46

శా॥ నాలోపంబుల నెన్ని తెల్పుకొన నోండా? ఔండ? నీమేళ్లుల
ల్లో లెక్కింపఁగరావు నీ తుమకు పోటీయున్నె? యౌదార్య కా
ర్యాలంకారమ నీవు, శోభనగుణ ధ్యా! శంకరా! సార్వభౌ
మా! లక్ష్మీగిరిజాకళత్ర! శివరామా! వేంకటేశప్రభూ! ॥ 47

మ॥ రిపులున్స్నేహితులంచు భక్తులకు లేఁగేకాదె? యెట్లుండు? రె
ల్లపుడు న్నీపయినిల్పుచిత్త మెటు లస్వాంతించు? మారెంతలే
క పరుల్మిత్రులుఁగూడఁ జూడనయినన్గాంక్షింప రీమేని సాఁ
కుషని న్మానినఁగాదె నీ భజనసాగర్? వేంకటేశప్రభూ! ॥ 48

మ॥ కవుఁగిళ్లంబడి క్రంతలన్దిరిగి యంకాపాంకముల్జెందుచు
"స్తనమాత్రంబు విరామమేర్పడదు నిన్బ్రార్థింప" నంటి న్బలే!
కవుఁగిళ్ల న్మలిక్రంతలం దెచట నిస్సన్గొంటి సర్వాత్మకా!
శివనారాయణ! సంశయంబువదలెన్ శ్రీవేంకటేశప్రభూ! ॥ 49

శా॥ ఎన్నోమారులు పల్కియుండు నను నీ వీయాపదన్దేల్చినన్
నిన్నే ప్రొంతునటంచు; నాతరుణమీదేల న్మఱొండేర్పుదాఁ
క న్నీమాటయెలేదు నిక్క మిది లెక్క న్సేయవీ వెంతు సు
మ్మన్న న్మాకిటనిల్వనౌనె శివరామా! వేంకటేశప్రభూ! ॥ 50

మ॥ "తునుఁగన్ధర్మము భూమికేనఱుగుదెంతున్ ధర్మసంస్థాపనం
బునకై" యన్ననియామకంబు సుఖదంబౌ? ధర్మమొందేనియున్
దునుఁగన్బాఱఁగనీమియో సతతసంతోషప్రదంబౌకొ? పో
వనురా నైనప్రయాసఁ దప్పుకొనలేవా! వేంకటేశప్రభూ! ॥ 51

మ॥ ఎవినైవేద్యముఁబెట్టిన న్దినుట యింతేనొసనుంగాన మే
లవృథాతంతనిపించుచున్నయది లీలామానుషాకారివై
సవిలాసంబుఁగ నందుకోఁగదవె! మాసంతోషముల్మించ నో
శివనారాయణదేవ! భక్తిసులభా! శ్రీవెంకటేశప్రభూ! ॥ 52

మ॥ జగదాధారుఁడవీవు సర్వమును నీ సంపాదితంబై చెలం
గుఁగదా! యెయ్యది "రమ్మ నీవిపుడునైకో"మ్మంచు నీఁజాలువాఁ
డ? గురూత్తంసమ! నన్ సృజించి యిటులాడన్నిల్పు టీవేకదా!
మగుడ న్నన్గయికొమ్ము రమ్ము! శివరామా! వేంకటేశప్రభూ! 53

శా॥ నీమానక్షణమైన మాకు యుగముల్నిండారు నాయుష్యమే
పో మాకల్పము, మంచిచెట్లలకు నెడ్డో చట్టము ల్పుట్టి మా
పై మప్పంబడకే శిలాక్షురము శేవ న్సాగు నేయిట్లు? కా
లామేయప్రతిభానుపాలనవిలాసా! వేంకటేశప్రభూ! ॥ 54

మ॥ ముపురో నల్వురో సంస్కృతింగలుగ నంహార్గోమార్గులయ్యేన్ భరిం
పవశంబౌటరుదయ్యె మర్త్యులకు నప్పా! నీవా యెన్నెన్ని యో
భువనాళుల్ తదనంతజీవముల నెప్పున్ బ్రోతు ధర్మస్థితిన్
శివనారాయణ! అద్భుతావనవిరాజీ! వేంకటేశప్రభూ! ॥ 55

మ॥ గుణినో, నిర్గుణినో, యసద్గుణినో, నీకుంగూర్చు చందాన నా
గుణమున్ దిద్దుకొనంగరాదె యెనరెగ్గుల్గులుంగూర్చుపె
త్తన మిందేరికినైన లేదుగద! సంత్రాణైకశీలా! స్వయం :
మననానందవిహారలోల! శివరామా! వేంకటేశప్రభూ! ॥ 56

మ॥ గణనాతీతములైనలోకములలోఁ గామాదిసంగ్రస్థమై
ఘనధర్మచ్యుతి నింతకున్ మిగులులోకం బెద్దియోయుండి దా
నినిరక్షింపఁగ నేగియుండవలయున్ని వట్లుగాకున్న నిం
దనయంబున్ననుపింపవా? నయవినోదా! వేంకటేశప్రభూ! ॥ 57

మ॥ కనుల న్వీనులఁ జేతుల న్పదములన్గాయంబున న్నిసమ
ర్చనమున్సేయఁగ దుర్లభుండవగు టీశా! మాటలొక్కింట సే
వనముం జేసెద నంతరాళగతి నాపల్కుల్నినుం జేటుఁబొ
మ్మనుసంకల్పము కల్మిబల్మి శివరామా! వేంకటేశప్రభూ! ॥ 58

మ॥ వివరింప న్సవరింప లోకములకు న్విద్యాగురుస్థానవై
భవమున్గైకొని సర్వకాలముల సర్వప్రజ్ఞల న్గూర్చువాఁ
డవు నీవేకద! తల్లిదండ్రిగురుజాడల్దాల్చి ప్రేమప్రభ
న్శివనారాయణ! చిల్కుచుండెదవు తండ్రీ! వేంకటేశప్రభూ! ॥ 59

శా॥ మాకంటెన్గల రన్యలోకముల ధర్మస్థాపకుల్ శ్రేష్ఠు లా
లోకింప న్మెఱుఁగు ల్గ్రహింప మనుజు ల్పోరానిదూరంబు తే
లా కైవల్యపదార్థులౌట కది మేల్ప్రాపేకదా! వారికే
నీ కల్పించితె రాకపోక లిటకు న్శ్రీ వేంకటేశప్రభూ! ॥ 60

మ॥ అవిభాజ్యంబు విభాజ్యమున్నగునె నీయానందతత్త్వంబు చూ
డవె నీనాయెడ సార్థకత్వమునగాథంబౌట నీదృష్టిలో
నవిభాజ్యంబయి నాగుదృష్టిని విభాజ్యంబౌనె? భేదస్థితి
న్శివనారాయణ! త్రోసి కల్పుకొనుమంటిన్ వేంకటేశప్రభూ! ॥ 61

శా॥ భావప్రౌఢిమచేతనే కొలువు సంపాద్యంబుగాఁదోఁచి త్వ
త్సేవానంద వశీకృతాఖిలతనూచేష్టత్వముం జెంది యే
యేవాక్యంబుల నెంతుమో తెలియ మాయీమంచిచేట్టల్ క్షమా
ర్హావజ్ఞానములంచు నెంచు శివరామా! వేంకటేశప్రభూ! ॥ 62

మ॥ ఘనధర్మచ్యుతికల్గ పత్తువనువాక్యంబే నిజంబైన ని
న్ననయంబిందెవసింపఁజేయుటలు మాహస్తంబులంజిక్కునే
లనెదే? నిత్యమధర్మకార్యముల దైన్యంబొంద నల్లేరుమీ
దను బండిన్నడిపించుటం చెఱుఁగరాదా! వేంకటేశప్రభూ! ॥ 63

మ॥ అవినీతిన్బడి నాదినాదియని నిత్యంబిందు స్వోత్కర్షఁగో
రి వరిష్ఠంబగు నేకవాదము విచారింపఁగలేమైతి మె
ట్లువిపంచించిన మాకుఁ దుట్టతుద నీలోఁజేఱుకొంటేగదా
శివనారాయణ! నిత్య మచ్యుతవిలాసీ! వేంకటేశప్రభూ! ॥ 64

మ॥ గణనాతీతములైన రిక్కగము లాకాశంబునందెందు న
త్యనపాయస్థితి సంచరించు వెలు వెద్దానన్ సమాస్తంబో త
ద్ఘనతన్ నీకళఁగాస్మరింతు మదియే దైవంబనన్వచ్చు నీ
యనుసంధానముఁ గందుమందె శివరామా! వేంకటేశప్రభూ! ॥ 65

మ॥ సకలప్రాణులు నీకళాణువులెగా సర్వజ్ఞ! యందొక్కటిం
కొకటిన్ ముక్తికినాశ్రయింప నగులాభోత్సేక మేముందు దో
షకుతారంబు భవత్పదార్చనమయా; "సన్న్యాసిసన్న్యాసి రా
చుకొనన్ బూడిదెగాక రాలునొకొ లక్ష్మల్?" వేంకటేశప్రభూ!

మ॥ ఉవిదాఘూపముఁ బూరుషాకృతియు లేకుండుంగదానికు, సుం
తవిచారింపక యేయకాలమున సంకల్పించితో మాకు వా
ని, వికల్పంబొకయింత లేక చెలఁగె న్విశ్వేశ! యెట్లోగదే
శివనారాయణ! తద్విరామము విరించీ! వేంకటేశప్రభూ! ॥ 67

శా॥ ఏకాలంబునఁబుట్టెనో జగతి? ఆయీలోన నెన్నింటిలో
నోఁకారే నరులగ్రగణ్యులు కథానుప్రోషితంబైన గా
థేకాదే యిట వారిసాత్యము సమర్థింపన్ జిరంజీవియై
మా కొక్కండుఁడుగానరాఁడు శివరామా! వేంకటేశప్రభూ! 68

మ॥ ఎడలేకుండుభవత్పదార్చనముచే నెంతేనియుత్కృష్టత
న్బడయ న్జాలినవారిపాదరజము ల్నాబోంట్లపాపంబులన్
గడఁకన్ బాపి పవిత్రతన్ గొలిపి స్వర్గద్వారవీథిన్ లలి
న్నడపుం గాని యసత్సమాశ్రయతనానా? వేంకటేశప్రభూ! ॥ 69

మ॥ జవసత్త్వంబులపేర్మి నాకొకరు హెచ్చా? నాకు నేనన్న భా
వవిలాసంబున నిన్నినాళ్ళుఁజనె క్రేవ న్నీవెబోధించుచో
నెనరో యేటికిసోదెయంచు నిను నింతేనాదృతింజూడ నో
శివనారాయణ! తెల్వినేఁ డిటులవచ్చెన్ వేంకటేశప్రభూ! ॥ 70

మ॥ అనురాగంబొకటే సమస్తసుఖదుఃఖావాప్తికి న్మూలసా
ధన మద్దాననె యీషణత్రయము సంధార్యంబు దానన్ జనిం
చును కామాద్యరిషడ్విలాస, మిఁకవిజ్ఞు ల్నీపయింజూపుభ
క్త్యనురాగంబును నీదృశంబె? శివరామా! వేంకటేశప్రభూ! ॥ 71

మ॥ రవులేపెక్కురు వారిఁజుట్టెడు గ్రహగ్రామంబులెన్నో? తదు
ద్భవజీవావళులెన్నొ? వృద్ధి నవి యీపై నెన్నికానున్నవో?
అవగాహ్యంబె? యొకొక్కజీవి దినచర్యన్ వ్రాసిపోషింప నో
శివనారాయణ! అద్భుతావనవిలాసీ! వేంకటేశప్రభూ! ॥ 72

మ॥ అనురాగంబుఁ బరోపకారమున నే యత్యంతమున్నిల్పి నీ
యనుసంధానము నీచరాచరసమస్తాశావకాశంబులఁ
దనుభావించి పరోపకారమున నిన్నుం బ్రీతినొందించు నె
మ్మనమందే నిజమైనభక్తి శివరామా! వేంకటేశప్రభూ! ॥ 73

శా॥ నీయాజ్ఞన్ సురలేని దాఁటఁగలరా? నిన్విస్మృతింజెంది యే
మే యేమేమొ యొనర్పఁబూనెదము స్వామీ! సత్కృపాదృష్టి మా
మాయజ్ఞానజముల్ క్షమించి జయమిమ్మా ప్రోవరమ్మా! సమ
స్తాయాసంబులడంపుమా!, వినతిఁగొమ్మా, వేంకటేశప్రభూ! ॥ 74

మ॥ భువనంబుల్ముకురంబులై చిటికలో ముప్పోకలన్మాఱు నీ
వ్యవసాయంబును జూపెడి న్గనుమ జీవంబు ల్జనింబొందుచో
వివిధప్రజ్ఞల సంస్కృతి న్మెలఁగుచో వేసారి నిన్జెందుచో
శివనారాయణ! సత్త్వముఖ్యగుణరాజీ! వేంకటేశప్రభూ! ॥ 75

శా॥ ఈకేల్వేసెడిలెక్క వేయ స్మరణంబీవాక్కునన్ సాగ నే
యేకాలం బవకాశమున్ వదల కందిందేగుచిత్తం బిసీ!
నాకేసిగ్గనిపించు నాజపము లన్నా! నవ్వుగాదో టునీ
కాకక్కుర్తి సహించి ప్రోవు శివరామా! వేంకటేశప్రభూ! ॥ 76

మ॥ పరమాత్మన్నినువీడి యీకణము సంభ్రాంతి న్మహాసృష్టినీ
వఱకే జన్మలఁ గాలవాహిని నసంభావ్యోరు దూరస్థలాం
తరపాతంబయి తోటివారలు నిను న్దర్శింప నీక్షించి కా
తరయమ్యేన్ నినుఁగానలేక కనరాదా! వేంకటేశప్రభూ! ॥ 77

మ॥ కవలాభీతియుసాపరాధతయు బింకంబూడ్పఁగాఁ గర్మసం
భవమా సంసృతిలోఁ జికాకుపడి నీపైవాదుఁగల్పించుఁ గ్రూ
రవిధానుండవటంచు మర్త్యుఁ డణుమాత్రంబేని గోపింప వో
శివనారాయణ! సత్కృపారసవిభాసీ! వేంకటేశప్రభూ!॥ 78

మ॥ ఒకరాజ్యంబున రాజుఁ గొల్చెడుసహోద్యోగిసంఘప్రణా
ళికపోల్కి న్వెలయించితే యుపసురాళిన్? మాధరాగోళపా
లకునిన్ దెల్పుమ భక్తిచే నతనివాల్లభ్యంబు మేమాలసిం
పకపొందన్వలె చిద్విలాస! శివరామా! వేంకటేశప్రభూ! ॥ 79

మ॥ విమలప్రజ్ఞులు, ధర్మసూక్ష్మముల మావృద్ధిన్ బ్రసాదింప ను
త్తమలోకంబులనుండి వచ్చుటలు తథ్యంబేమొ? ఆయుఃప్రమా
ణము జిజ్ఞాతృబలంబు స్వల్పమగుటంగాఁబోలు వారేగివ
చ్చుమహాసంధి యుగంబులేచనెడు విష్ణూ! వేంకటేశప్రభూ! ॥ 80

మ॥ యువసంబు లుసిడిగాడ్పులన్సుడిసి యూర్ధ్వాధఃప్రచారంబులం
దు వెసన్దూఁగొనుభంగి జన్మమరణానుష్టానచక్రంబున
న్వివశత్వంబునఁ గ్రిందుమీఁదగుచు నుద్వేగించుజీవాళికిన్
శివనారాయణ! ముక్తి యెన్నటికోకో? శ్రీవేంకటేశప్రభూ! ॥ 81

మ॥ రవియొక్కండిడుకాంతినే మిగులదూరస్థు ల్భరింపంగలే
ర, వియత్ప్రాప్తరవిగ్రహప్రచయనిర్యద్భీమదీప్తిన్భరిం
చువియత్తత్త్వమునన్ వెలుంగు ప్రభ హెచ్చున్ బోల్పఁగాశక్యమే?
శివనారాయణ! తత్ప్రభాపరమభాసీ! వేంకటేశప్రభూ! ॥ 82

మ॥ నవరత్నాళి నికామగాములయి యందంబీయ దివ్యేంద్రనీ
లవికారంబగుచాయలో సకలమున్నగ్నంబుగాఁదోఁచె నెం
తవిచారించిన నీకుఁజాయకును భేదంబింతయుందోఁప దో
శివనారాయణ! ఆదితత్వపదభాజీ! వేంకటేశప్రభూ! ॥ 83

మ॥ సకలవ్యాప్తి, సమస్తకారణతయున్ సామాన్యమై నీకు మిం
టికి సామ్యంబుగలట్లుఁదోఁచు నదియేనీవన్నచో బాధకం
బొకఁడు న్గల్గునె? తన్నిజానిజకళావ్యూహంబులన్ జొన్పుమా
యకు నుచ్చాటనమంత్రమిమ్ము శివరామా! వేంకటేశప్రభూ!॥ 84

శా॥ భూనీరానలవాయుపూర్తి దెసలన్ బొల్పొందుగోళంబు లె
ద్దానం బుట్టి మెసంగి పొల్పఱునో నిత్యం బట్టియాకాశత
త్వానూనప్రభయే విరాడ్విభయుఁగా ధ్యానించుటే యాదిమూ
ర్తీ! నీధ్యానముఁగాగణింప సరిగాదే? వేంకటేశప్రభూ! ॥ 85

మ॥ తనలోఁ బుట్టినభూజలానలమరుత్తత్వంబులం దున్నశ
క్తిని యాకాశము కొంతచూపమిని దత్తేజోధికుండై స్వతం
త్రనియంతృత్వముఁ గల్గుదేవ మొకఁడుండంబోలు సర్వాధ్యుఁ డం
చనిపించున్ సకలస్వతంత్ర! శివరామా! వేంకటేశప్రభూ! ॥ 86

మ॥ వడిచే బొంగరమే రవోంకరణమున్ బాటింప నెంతో వడిన్
గడకన్ మింట భ్రమించుగోళముల యోంకారారవాధిక్య మే
ర్పడునే యూహ మదింప నింతయని? తద్రావంబె యోంకారవా
చ్యుఁడవౌనీరమణీయనాద మనిపించున్ వేంకటేశప్రభూ! ॥ 87

మ॥ అవికారున్నినుఁ జేర భూమ్యనలవాయ్వాకాశతత్వాళిదాఁ
టవలెన్ స్థూలవికారయుక్తతనువుండన్ దుర్ఘటంబద్ది మే
నవియన్ బొఱకమున్నె మానసబలవ్యాపారయోగంబునన్
శివనారాయణ! నన్నుఁజేర్చుకొనవా? శ్రీవేంకటేశప్రభూ! ॥ 88

మ॥ పుడమిన్నీరము వీనిలోజ్వలన, మీమూఁటన్మరు, త్తాకసం
బెడమీకంతటనాల్గిఁటన్, ప్రకృతి యీయేనింట, నీచేతనే
ర్పడుబాహ్యప్రభ మాతనుస్థమగుచున్ బాలింప సృష్టింపఁగా
నడఁపన్ మాకును శక్తిఁగొల్పు పరమాత్మా! వేంకటేశప్రభూ! ॥

మ॥ భవదవ్యాజకృపారసంబు జినుకుల్ పైపోఁకఁగావచ్చుచో
నవినీతిన్బడి నేనొనర్చునపరాధానేకముల్ దావవ
హ్నివలెన్ వానినిమ్రింగుచుండవలయున్ నిత్యంబుఁ గాకున్న ని
ట్లవియింపన్ జెడుగుల్ ననున్ జెనకనౌనా? వేంకటేశప్రభూ! ॥ 90

మ॥ "ననుఁగొల్వన్వలెనన్నయాశ కనుగుణ్యంబౌ మనోదార్ఢ్య మీ
తని కీయన్వలె"నన్నయూహ భవదాత్మన్ బుట్టదో? దానివా
నినె చేకూర్చుకొనంగనిమ్మ"నుచు మానిత్వంబు సంధించెదో
జనకా! బింకముడించె నీవెగతి శ్రీశా! వేంకటేశప్రభూ! ॥ 91

శా॥ రామో నీదరి కెన్నిమార్లో? ముదల స్రంజించుకార్యంబుకై
పోమో యెయ్యెడనో జనించి మహిలన్? భూతస్పృహాజ్ఞెంద కే
మేమో పల్కెడిమా కెఱుంగనగునే యేష్యంబు? మన్నించి యో
స్వామీ! మాకుఁ బ్రబోధమిచ్చుటకు రావా? వేంకటేశప్రభూ! ॥

మ॥ అహహా! నీప్రభ కోటిభాస్కరఘనాభాధిక్యమానంమ్రు నా
కిహామం దంగుళతాంశమేని కనరా దేమందు నోయయ్య! త
ద్గ్రిహయాఘస్పృహ మామకీనదురితవ్యాపారమేఘౌఘముల్
బహుళస్ఫూర్తిని నన్నుఁజుట్టుటనో యప్పా! వేంకటేశప్రభూ! ॥ 93

మ॥ నిరతంబు న్భవదీయనామమును వాణిం జేర్చుట ల్కృత్యము
"ల్పరమేశార్పణ"మంచు వానికి భవత్పాదస్థితి న్గూర్చుట
ల్వరదా! తెల్లమెకాదెనీకు? నినుఁ గొల్వన్జూచునాకు న్భయం
కరవిఘ్నంబులు సోఁక నేమికతమౌరాగా? వేంకటేశప్రభూ! ॥ 94

మ॥ నిను ధ్యానింపఁదలంచువెంటనె కడు న్తీవ్రంబులై లౌక్యయో
జనము ల్మొండుగఁజిత్తము న్మసరుఁ దచ్చాపల్యతంజిక్కుబు
ద్ధిని జక్కన్గుదియింపఁ జాలమిని భక్తిన్నేర్పరాకుండె, ని
న్గనఁగా యోగ్యత కల్గుటెట్లో? నిగమాంకా! వేంకటేశప్రభూ!॥ 95

మ॥ ఎవరైన న్నినుఁగొల్వ నాసపడిరే నెంతేనియు న్వారిచి
త్తవికాసం బొనఁగూర్పఁజాలులలితోత్సాహంబు సంధింప కే
ల వికారంబులఁ గ్రుంగఁ గైకొనవు? తేలన్లేక భారాహతి
న్గవుదవ్వైపడువారిబాధ కనరాదా! వేంకటేశప్రభూ!॥ 96

మ॥ అసలేమూఢుఁడ, నందులో మఱపు క్రోధాదుల్ కడు నేర్పరు
ల్వ్యసనత్యక్తముగాఁగ నీవిడిన దీర్ఘాయుష్య మెట్లేగునో?
ముసుఁగౌ పూర్వఫలంబు తీఱకయమున్నుం దెట్టినూత్నాఘము
ల్వెసఁగన్బొప్పునో యాఁకుకోఁగదె దయాళూ! వేంకటేశప్రభూ!॥ 97

శా॥ ఎంతో యత్నమదేల? మేలుసమయం బేపార నావేళ నా
యంతస్సున్మఱిలింతు నీదెసకుఁ బోవన్మించు నన్వృథాపానినై
కంతుప్రేరితవృత్తుల న్మనముఁ జిక్కంజేయుట న్నేఁడు నీ
చెంతం జేర్ప నసాధ్యమయ్యెడి యశస్వీ! వేంకటేశప్రభూ! ॥ 98

మ॥ జనియెల్లం బొరపాట్లతోఁ జనెడి వ్యర్థంబైన పూర్వార్ధము
న్ఘనయత్నంబున నుత్తరార్ధమునఁ జక్కంజేయ యోజించుచుం
టిని, ప్రారబ్ధము సంచితంబు నిచట న్జేయూఁత లేమూనో? కా
వో? నను న్నీదయ యెట్లు తేర్చునో? స్వయంభూ! వేంకటేశప్రభూ!॥ 99

మ॥ "అతిసర్వత్రవిసర్జయే" త్తనెడివాక్యార్థంబు నూత్నంబె? యు
ద్ధతకామాత్తరతఁ గన్నుఁగానమిని లౌక్యాసంఖ్యసౌఖ్యంబులం
బతితత్వంబుఁ గడించి పాపఫలము న్వాయంగనే క్రోసుటం
గతవార్బంధము లిప్డు వ్యర్థములెగా! నావేంకటేశప్రభూ!॥ 100

మ॥ కడుధీశక్తియు దేహదార్ఢ్యమును లోకం బేమొ నన్నుద్ధరిం
చెడునంచు న్నెరనమ్మి కోల్పడితిఁ జేసేఁత స్వామీ! శక్తులి
ట్లుడుగ న్బిక్కమొగంబు వైచికొని యయ్యో! యంచు వాపోదు న
న్నడుగ న్జేర నొకప్పుడే న్దలఁపవయ్యా! వేంకటేశప్రభూ!॥ 101

మ॥ కలకొంచెంబున నీవిఁ జూపితిని వాక్పారుష్యముం జూపితిఁ
బలుక న్సత్యమెకొంటి, నొండ్లకొఱకై బాధైన సాధించితి
న్గలలోఁగా కిటఁ దైహికంబయిన దుష్కామంబు వర్జించితి
న్నిలువం జేసితి వాక్కు నీగణనఁ గంటే! వేంకటేశప్రభూ! ॥ 102

మ॥ మదమున్న న్విషపాయిగాఁడు స్పృశియింపం బోఁడు వహ్ని న్నరుం
డదిరా వచ్చుఫలం బెఱింగియును ద్రవ్యస్త్రీసుఖేచ్ఛం బడిం
బడిఁ బాపౌఘములం జరించెడు నృశంసత్వంబున న్బాపమ
న్నది సద్యోఫలదాయిఁ జేయగదవన్నా! వేంకటేశప్రభూ! ॥ 103

మ॥ ఘనకార్యం బొనరించి తన్నొగడికన్గైకొంటకాదయ్య నే
నొనరింపందగుదాన మత్కృతము లెంతో సూక్ష్మభాగంబులం
ట నిజంబైనను నామనంబు నయపంథాచారియేగాని దు
ర్వినియుక్తంబుగ లే దటంచనెద శౌరీ! వేంకటేశప్రభూ! ॥ 104

మ॥ అదిరా! మానసలాఘవత్వము కృతం బత్యల్పమైనం బదిం
బది దెప్పంగనుచుండుటబ్బురము! శంపాచంచలం బౌర! న
ల్బదియారేండ్లవయస్సుదాఁక నొనరింపంబడ్డ మేల్కీడులం
జదువంజూడఁగ నేల? నీవెఱుఁగవా! నా వేంకటేశప్రభూ! ॥ 105

మ॥ గతమేమో గతమయ్యె, రోఁటఁ దలఁ జిక్కంజేసి రోఁకంటికు
ర్వాతి తప్పన్వలెనంట వెఱ్ఱిగద! భారం బింక నీదేసుమీ!
కృతముం జూచి యనర్హుఁడంచనెదో పోనీ పాపమంచుం దయా
మతిఁ గైకొందువొ? సర్వసంపదభిరామా! వేంకటేశప్రభూ!॥ 106

మ॥ అమలాంతఃకరణంబున న్మిగులనర్హంబౌ ప్రమోదూతమా
ఘము గృష్ణార్థములోఁ దృతీయఁదగు శుక్రప్రాప్తవారంబున
న్సుమదామప్రభలీనునీశతకముం జోడించు కేల్దోయి నీ
కమలాంఘ్రిద్వయికి న్సమర్పితము నాకై వేంకటేశప్రభూ! । 107

మ॥ యతిరాజెవ్వరు? నీవ ప్రత్యహము సాహాయ్యంబు మాకిత్తు వే
యతుకుం జెందవు, యోగసంస్థితి ననన్యాయత్తచిత్తంబుతో
డుత నా సర్వము నీపదాగ్రగతినుండుంగాత మాచంద్రస
ద్వితతం బౌచు, భవత్కృపాగురుకళాప్తి న్వేంకటేశప్రభూ! ॥ 108

---

# శతకస్తబకము.

# మాధవ శతక కదంబము.

## ప్రథమోపాయనము.



మహిళామణిన్ మిగుల చెన్నలరారు స్వరూపసంపదన్
హైమవతిన్ బ్రతాపమహిమాదికశక్తులచే సరస్వతీ
భామను సత్కళాగరిమఁ బ్రౌఢి - భరించుచు సర్వలౌకిక
క్షేమకరైకమూర్తివగు శ్రీకరు నిన్ను నుతింతు మాధవా!॥

చ॥ భువి జనియించి యిప్పటికిఁ బోయెను నల్బదియారువత్సరాల్
చివరకు నేడు తేలిన విశేషము లెవ్వియుఁగానరావు ని
త్యవిధివినా; మదీయకృతమైతగు నెయ్యది కూర్పవచ్చునం
చు విధిలిఖించెనో యలంతిసూచనమైనను లేదు మాధవా! ॥ 2

మ॥ స్మృతి యింతేనియు లేనివ్యక్తి కడుగంభీరంబు నావర్తఘో
రతరంగంబు భయంకరంబయిన పారావారమం దామహో
ద్ధతి నిందందును మున్గితేలుగతి నాద్యంతంబులున్లేనిసం
సృతియన్వారిధి నాదుయాత్ర యగుదెంచెన్ వ్యర్థమై మాధవా! ॥

ఉ॥ కావలెనన్నటుల్ వెలితిగానినికామవిహారిమైన పా
రావత మొక్కచో సుఖపరంపర మైమఱ పొందియుండ న
ర్త్వావసరంబుఁజూచుకొని యాడకు ఱివ్వన డేఁగవచ్చి యా
లావు హరించి పోవునటులన్ మృతి పొంచెడుఁజెంత మాధవా ! ॥

తరల॥ ప్రబలమా ప్రకృతిప్రవాహము బాఱి మమ్ములనెట్ట మే
ల్గబగబన్ వడితోఁ బురాకృతకర్మముల్ పయిమూఁగ ని
ల్వఁబడఁ గాల్నిల దేమితోఁచదు స్వాంతమోజనసేయ నీ
యుబుసుపోనిప్రసక్తిలో సుఖమున్నె యేరికి మాధవా! ॥ 5

చ॥ ప్రకృతిబలంబుకంటెను బురాకృతపాపఫలంబుకంటె మా
కిఁకను విలక్షణంబయినస్వేచ్ఛ నొసంగితివొక్కొ? జీవవ
ర్తకమునఁ బుణ్యగౌరవముఁ దార్పఁజరించెడుచోటఁ జిత్తముల్
తికమకనొంది పాపములతెన్నునఁ బర్విడుచుండు మాధవా! ॥ 6

శా॥ పుట్టంధుల్ కనుగానరామి పతనంబుల్ కాంచుట ల్పాజమా
కట్టా! కొంతవివేకముండియు నసత్కార్యంబులన్ మూర్ఖపున్
బట్టుల్ దాల్చి ప్రపంచమాయఁబడు టేప్రారబ్ధమో? చూచుచున్
నష్టేటన్ బడి యెంతగింజుకొనినన్ వ్యర్థంబెగా మాధవా! ॥ 7

ఉత్సాహ॥ పూని యంతరాత్మతెల్పుబోధమాని స్వాభిమా
నానిసర్గసృష్టి భ్రాంతినంది పూర్వపాపముల్
పో నడంపఁబోక పెంపుఁబొందఁ జేయుచుండుమా
కౌనె పాపముక్తి యెన్నఁడైనఁగాని మాధవా! ॥ 8

చ॥ జనిజనిఁ గ్రొత్తపాపముల •సల్పెడుమా యఘసంచయోగ్రకృం
తనము యుగాంతకప్రళయదర్పమునందగునేమొ నీకుపా
వనకృప; నంతెగాని యడఁపన్ వలె మేమె యటంటసున్న యా
పెనుపు నడంచి మోసుకృతిఁ బెంచియొ తేర్పుముమమ్ము మాధవా॥ 9

వృ॥ కృషివాణిజ్యములను నష్టంబై కీలెడలిపడెడువారికిఁ
సుషిమాద్భుష్టిని గ్రమవృద్ధిన్ రాజులు బుణమిడి కనునట్లుగఁ
విషయాప్తిన్ సుకృతముపోవంగన్ వీడ్వడియెడు ననుఁబోంట్లకున్
దృషబోఁ బున్నెము నెరవీరాదే తీర్పమనుభయమె? మాధవా!॥ 10

చ॥ ప్రకృతియెడారి కోరికలు బాడబవహ్నులు ద్వంద్వముల్ నిదా
ఘకృతఖరాగ్నివాయువులు కామముఖారులు దావవహ్నివ
ర్గకప్రళయోగ్రమేఘములు ప్రాణుల కీకలిశక్తి తప్తగం
ధకమును గ్రక్కుపర్వతము తాలిమి నిల్పుటయెట్లు మాధవా!॥ 11

మ॥ ప్రకృతిశ్యామ భ్రమమానురక్తిఁగొలుపన్ ద్వంద్వాయుతోరుస్థలిన్
వికృతిన్ సంజనితున్ బరుండనిడి తద్వీర్యంబటున్ షణ్ణిరో
ధకు లుగ్రంబుగఁ గాలుసేతులకు బంధంబూన్చినొక్కన్ గలి
ప్రకటైరండరసంబు నుఁగ్గిడఁగఁ బాపంబెచ్చదే? మాధవా!॥ 12

వృ॥ కామాదులను గొల్వగారడీఁ జూచుటై
నీమానఁ గలితెల్వు నీతులే పాడుటై
వేమారు లఘుయుక్తవిధినే యాడుటై
యే మెట్లునినుఁజేరుటీశ్వరా! మాధవా!॥ 13

శా॥ యోగంబో! యజనంబొ! భక్తియొ! యెటో యోజించిపూన్కైన్ నినున్
రాగంబొప్ప సమాశ్రయించునెడ నైంద్రంబైనవిఘ్నక్రియో
ద్వేగం బాత్మకుఁ దావకాస్యకృతులన్ బేరాసలన్ గొల్వ స
య్యో! గెల్వంగలమెట్టు లీబెడద, నీవూహింపుమా! మాధవా!॥ 14

వృ॥ ఆదె వసంతుఁడు క్రొత్తచిగురుల నలరుటలుగులు నూతడిన్
గోదమత్తుమ్మెదనారిరవమదె కులుకుటువిదలువారెపో
యెదిరి చిల్కహలుమాయిపయి మరుఁ డెగిరి కుముకుచు ఁబూగదల్
గుములుగా నిగిడించెడిని యెటు కుమురుకొనుమది మాధవా!॥ 15

మ॥ స్మర సంసృష్టమహేంద్రజాల మెటులో మాయించినన్ గ్రోధమ
త్సరలోభోన్మదపట్టభద్రగతి సంస్థాపించు రంధ్రంబు నె
ట్టిరవంతే న్గనినంత నాకపతి “గాండీవంబు”గాఁదోఁచె మా
చెఱలిప్పట్టున బాసటై యొసగఁవే చేయూఁతమున్ మాధవా!॥ 16

వృ॥ అదేమో! భయోద్వేగమత్యంతమైమదిన్ని యెడన్నిల్పుమాయత్నముం
గుదింపన్ గుదింపన్ దిగుల్పుట్టెడుంగదే! రమ్ము రక్షింపఁగా మాధవా!॥

మ॥ కనిపాతేసిన గాలికిన్ బెఱుగునీఁగల్ దోమలుం బోలు మూ
కనుకంపన్విడి కానఁజాలనిరహస్యస్థానము న్జేరియుం
డినసీకేమిసుఖంబు? మానుషులఁగానీ, చేష్టలంగాని కాం
చినచో నీకు వినోదమై ముదములన్ జేకూర్పవే మాధవా!॥ 18

మత్తాక్రీడ॥ కన్నబిడ్డకుఁ బాలొసంగిన కఱఁగు సన్నన సూవసం
బన్నభ్రాంతిని దాది మోమున నతనిమూఁకెడి మూషరీ
తి న్నయంబునుపీడి యీప్రకృతిన్ మనుజున్ బడనూఁకి నీ
వెన్నఁ డేమఱియైనఁ గన్గొన వెదికతంబొకొ? మాధవా!॥ 19

ఉ॥ సత్యములేదెలేద, కొనసాగినన్ నెపమూనియుండు నౌ
ద్ధత్యముమెండు మోస మహహా! పరిపూర్ణము రంకుబోవుటల్
నిత్యపథంబు లిట్టియవనీతుల కాకరమైనదుష్టసాం
గత్యము నాకు నేటికని కన్పడకుండెదవొక్కొ? మాధవా!॥ 20

అంబురుహము॥ పున్నెముచెల్లినవెంటనెజీవము భూమిఁబుట్టునటంద్రహో
యన్నిఁట నీకలియందటుఁబుట్టెడి యంతకున్ గలదే యఘం
బెన్నఁగ నెంతవిరోధికినేనియు నిట్టిహైన్యము నీకు మా
పన్నశరణ్య! నతావనదివ్యపదాబ్జశోభిత మాధవా!॥ 21

మ॥ గిరిపాతంబుల హస్తిఘట్టనల సంకీర్ణాహిదష్టాళి కిం
కరసంఘర్షణలన్ దవాగ్నిహతులన్ గష్టంబులెన్నేని మే
ల్దరహాసంబుననోర్చి నిన్గొలిచి ప్రహ్లాదుండు రక్షార్థ్వాతన్
వఱలెన్ దానవొకింతలే కెటుతరింపన్ జాలుదున్ మాధవా!॥ 22

శా॥ కారావాసభరంబు తప్తసికతాగ్రస్థానభారాంచిత
ప్రారంభంబు కశాప్రహారములు నిర్దాక్షిణ్యసూచీముఖ
క్రూరాక్షిద్వయభేదనంబుఁ బువులన్ గొట్లాటగా గోపన
శ్రీరంజిల్లె వృథామొఱల్ గొలుప తీఱే మాకిటన్ మాధవా!॥ 23

మ॥ కలసర్వస్వమెగాక నీకొఱకునై కన్నైన మేనైన నా
కులపాటింతయులేక యీఁగనినభక్తుల్ రక్షణార్థత్వసి
ద్ధులుగా కీనను బోటి స్వార్థపరులందున్ సిద్ధికన్పట్టునే?
తలపైకెత్తి "ప్రసీద!" నాఁ ద్రప హృదిన్ దట్టాడెడిన్ మాధవా!

మంజుభాషిణి॥ ఇటుచూడుమీ! తొలఁగి యేగనేటికో?
మటు మాయమై చనఁగ మానుకొందునే?
త్రుటియైన నీస్మరణ -తోడునీడవై
నటియింపు నీవెగతి నాకు మాధవా! ॥ 25

మ॥ సిరిపోఁ గానలడస్సి యప్పునకు స్వస్త్రీపుత్త్రకుల్ దాల్మితోఁ
బరదాస్యంబునఁగ్రుంగఁ బ్రేత వనసంవాసంబునన్ బుత్త్రదు
ర్మరణంబుంగని భార్యకంఠమునుద్రెంపన్ దెంపువాటించి నీ
చరణధ్యానము వీడఁబోవని హరిశ్చంద్రుండె రక్షార్హుఁడే
మఱుమాబోంట్లవిలాప మర్హాదశకిమ్మా! యెమ్మెయిన్ మాధవా!

మ॥ అలఁతన్ మిక్కిలిసోలి యస్థిగతదేహం బల్లలాడంగ నీ
ఖులునన్నంబును లేమిఁ బెన్మొసలి కాలున్ లాగదూఁగాడి నీ
తలఁపేదిక్కుగ వేలవత్సరము లుద్యధ్యానియూ హస్తిగా
కిల నాబోంట్లకు? రక్షణార్థులగుచున్ స్వేచ్ఛన్ గనన్ మాధవా !
శా॥ నీవారన్నమెభుక్తి జీర్ణవసనానీకంబె పైకప్పు నెం
దేవీక్షించిన నింట నెప్పుడయినన్ నిప్పచ్చరం బింకసం
తోషవిస్తార మహైన నిశ్చలత నెంతోభక్తి నిన్గొల్చి స
ద్భావుండైన కుచేలు నర్హాతకుఁ బాతాళాంతరస్థంబు మా
భావాంధత్వము నీదయార్హదశకున్ బ్రాపెట్లగున్ మాధవా! ॥28
మ॥ విపరీతప్రతిభాషలన్ గ్రియల దుర్వార్యత్వమున్ జూపుచున్
గృపఁబోనాడి సుసాధువర్తనులకున్ గీడ్పాటుసంధించు ని
త్రపులాపాపుల శిక్షకై వెడలు నీప్రస్థానకాలంబునం
దపనేయుంబని కూయివెట్టుటకు వెన్కాటయ్యెడిన్ మాధవా!॥ 29
మ॥ తనుధర్మంబగు స్వప్రయోజనపరత్వంబూని నాదైన్యమే
ఘనమన్ యోజనయుండియున్ మనసుజక్కంబట్టు దింకింతకం
టెనుదీవ్రంబగుదీనతన్ సుడియువానిన్ దేల్పు నీవేగుచుం
డినచో నామొఱ దుర్నిమిత్తమగునన్ జత్తమ్మునన్ మాధవా! ॥30
శా॥ పాలన్ జక్కెఱసోకినట్లు సరసవ్యాపారసాహిత్యవా
గ్జాలంబుల్ జిగిమించు ప్రస్తరణమై సప్తస్వరోద్గీర్ణరా
గాలాపామరసత్సుధాంకితములై యం దీవుక్రీడింప నీ
బాళిన్ ద్రుంతునోయంచు విన్నపముదెల్పన్ జఁకుదున్ మాధవా!॥
మ॥ శ్రితరక్షాగతి నీవు సర్వభువనశ్రీరంగమధ్యంబులం
దతిపుణ్యాత్మకులన్ బతివ్రతల సత్యప్రౌఢులన్ మానిసం
తతులన్ శ్రేష్ఠుల సర్వాసత్కృతులతో ధన్యత్వముంగూర్చుచో
నతికింపంగమకింప నాచెఱల విఘ్నాశంకచే మాధవా!॥ 32
మ॥ తిరుశైలోన్నతపీఠదేశముల సాంద్రీభూతకేళీవనో
త్కరనానాసుమసారభార్ద్రిమయి చక్కన్ వీఁచు నాపిల్లతె
మ్మెరలన్ సిద్ధపుభక్తిబృందములతో మేల్ హాయి వర్తించు నీ
వరసౌఖ్యంబున కంతరాయమని తెల్పన్ నాసాదన్ మాధవా!॥ 33

శా॥ అంతేలేని ప్రపంచసంతతులలో నష్టపుకాఁదగ్గమే
ల్సంతుల్ పోషణముల్ మృతుల్గుటేఁచిరచ్చులేనసి క్షీరాబ్ధిలో
వింతౌ పాన్పున మేనువాల్చి యచటన్ విశ్రాంతినిద్రించు నీ
కెంతే భంగకమంచు నించుకయు నోరెత్తన్ వెఱన్ **మాధవా!**॥ 34

శా॥ "అమ్మోనడ్గకపెట్ట" దన్నటుల **నాయారాటపున్** గారణం
బెమ్మేనే జైవివేయఁజూడ సమయం బింతేని గన్పట్ట దం
తమ్మే కర్మముజారుదాఁక నిటు లేఁదట్టాడినన్ గాని వీ
నిమ్మేఁద్రిప్పవె? కర్మమెల్లఁజనుటం కెన్నాళ్లకో! మాధవా! ॥ 35

పు ష్ప మా లి కా బం ధ ము.

చ॥ అలరులజాలరు ల్బయనయద్వయసాదృతి గీతిరీతి నీ
నెలవులఁ గ్రాలఁగానునిచి నిన్గొనియాడెద నాదభేదవృ
త్తులఁ బలుజాలులై మధువిధు ల్బధుసీర్ఘురిఁ బారి నీరిరం
సల నలతల్ లయింప సరి సద్రసవత్సవసేవ దైవమా! ॥ 36

శా॥ కాలేనొచ్చునొ? చేయినొచ్చునొకొ? భక్తత్రాణతీవ్రాస్థచేఁ
జాలున్ మూలయు నెన్న కేయుటికె దజ్ఞానాంధులౌదుష్టులెం
దాలోచింపరు తాకుతప్పటలు స్వాస్థ్యంబూను నిన్జూడకే
**నాలో** జంకునఁ బీచుపీచుమను నన్నా! గుండెలో **మాధవా!**॥ 37

మ॥ అవులే! మిక్కిలిశ్రద్ధ నన్యములలో నాకృష్టుఁడైనట్టులుం
టివిగానీ మఱి దొంగచూడ్కులను వీనింగూడ నష్టపుచూ
చువిశేషం బితఁడెఱ్ఱనే యెఱుఁగఁడంచున్ లోనభావించెదే?
నవులాటా? యిఁకనైన రమ్మిచటి కన్నా! వేడెదన్ **మాధవా!**॥ 38

శా॥ నామాఁటే భవదాత్మలేనియెడ నిన్నాళ్లిట్లు జీవింపఁగా
సామర్థ్యంబది **నా**కెగల్గెడినె? సాక్షాద్భక్తియున్ వెల్గునే?
శ్రీమంతంబయి తుష్టినీఁగలుగు నీక్రీఁగంటి మేల్చూపు **నా**
పై మున్పై పనిఁగొంట నిక్కమని తెల్పన్ సాగెదన్ **మాధవా!**॥39

శా॥ అబ్బో! నీవటులోరమోమిడి త్వదాస్యంబున్ గరాగ్రంబు చా
టబ్బన్ బెట్టుచు మందహాసమున లక్కాంబన్ గనుంగీటు నీ
తబ్బిబ్బేఁగనలేనె యేటికిటులీతాటోటు వాగింపఁబో
కబ్బా! దండము నీదరిన్ గొనగదయ్యా! వేగమో మాధవా!॥ 40

మ॥ కలిగెన్ నీమది నాపయింగృప యశంకం బాచుఁ గాకున్న నా
నిలువెల్లన్ గరి నిండు గద్గదిక కన్నీ రిట్టలంబై యిటుల్
కలుగన్ గారణమున్నె నిద్దలపఁగాఁ గన్గొమ్మిటుల్వచ్చి, నా
పలుకున్ సత్యముఁ జూడనైన నిటురావా! కాంచవా! మాధవా!॥

మ॥ నడువన్ జాలని వానికేగదవె చెంతన్ సాయముండన్ దగున్
గడిదేఱన్ మఱి సాయమెందులకు? భక్తశ్రేష్ఠులా వారివెం
బడి నీపోవుట ముఖ్యమా? తదితరవ్యక్తిన్ సుమార్గంబునం
దిడఁగా ముఖ్యమ? చూచి నాకొఱకు రమ్మా! సమ్మతిన్ మాధవా!॥

శా॥ నీచూపేకరవయ్యె మాకెపుడుఁ, బోనీ పిల్వఁగాఁ బిల్వఁగా
నేచాటన్ నిలుచుండియో పలుకు దీవెన్నాళ్ళకేనంచు నో
రాఁచన్ వీనులఱిక్కఁజేసి వినఁగా 'నాఁ' లేదు 'నూఁ' లే దిదే
మీ! చాతుర్యమ! పల్కయింతకనకంబే! యింకెటో? మాధవా!॥

ఉ॥ 'ఓ'యనఁగందెదే? నడువనూనినఁ బాదము లర్గిపోవునే?
న్యాయవిచారణం బొకక్షణంబునకే తలక్రిందులౌనె? యె
బ్బే! యెటుఁజూడఁ జాల మిదియే? సరసం? బెటనేర్చినావు? మా
నాయనగాదు! తుంటరితనం బెపుడెర్గవు రమ్ముమాధవా! ॥ 44

ఉ॥ నాకనకంబు పెన్నిధి, గుణంబులకుప్ప, సుధామరీచి, మా
ఆకిడు కల్పవృక్షము, నయప్రభనోమెడి కామధేను, వెం
దాఁకలి డప్పి శ్రాంతి యన కాశ్రితరక్షకుఁ బర్వులెత్తు సు
శ్రీకకృపాఝురంబు ననుఁ జెందుటికెన్నటికోయి! మాధవా! ॥ 45

ఉ॥ పోకుము పాఱిపోకు మెటొపోయిన తప్పును నాకు వీనిబా
ధాకతినత్వమంచు మదిఁ దద్దయు నమ్మెదవేమొ? మించుట
త్రాకల నీడ వెంబడినె రాక తొలంగునటోయి నీపుర
మ్యాకృతిఁజూప కేకళలనాడినఁదప్పునె 'రమ్మ' మాధవా! ॥ 46

శా॥ నీ వన్నింటనునిండియుండుటనె మానిత్యోత్సవంబుల్ మనున్
నీవే సర్వమువీడియేగినను లేనేలేవుసర్గంబు లే
ప్రావీణ్యంబున నెందుడాఁగెదవు సర్వవ్యాపి! నాప్రోల నీ
యావిర్భావము కల్గనేవలయునయ్యా! రూఢిగన్ మాధవా!॥ 47

ఉ॥ ముష్టికి మొండిబండ శరమున్ బొనరించెడురీతి నిగ్గనన్
గష్టములోర్చి యన్నముదకంబునునూపిరినాపి నీదరిన్
శిష్టగుమోడివేయనిది చెల్లదె? యోగ్యతకల్గదే? భళా!
యిష్టమువచ్చినట్లు విధియింపఁగ జంకవుసుంత మాధవా! ॥ 48

ఉ॥ చిత్రపుఁబల్కు కర్మమునశింపనివారికి ముక్తిలేదె? స
త్పాత్రత కీనిబంధనము బాధకమౌనె? యెఱుంగమొక్కొ? సా
విత్రికథన్ మృకండజు పవిత్రచరిత్రయు నీకుఁయీవికే
మాత్రము నడ్డుగల్గునె? సమస్తజగత్ప్రభువంద్య! మాధవా! ॥ 49

మత్తకోకిల॥ ఏనెపంబుననైన నామము నెవ్వఁడేనియుఁ బల్కుచుం
బ్రాణమీగినవాని పాపము భస్మమై కనుమోక్షమున్
మానితంబగుభక్తి నిత్యము మాన కాత్మపథంబునన్
ధ్యానమూనెడువాని కెయ్యది దాఁచియిచ్చెదు? మాధవా! ॥ 50

శా॥ ఏదోకోరికఁగోరి నీవొనఁగ నేనేమించు శ్రేష్ఠుండనన్
మాదమ్ముంగొని నీకునాకుఁగల ప్రేమగ్రంథిఁబోఁద్రెంచి చే
దాదూఱుంబడ నంతవెఱ్ఱినొకొ? నిత్యం బూరకే పాడ వి
ల్గాదన్ వారలుగల్గ రుండినను గల్గంబాఱ నోమాధవా!॥ 51

ఉ॥ రాముఁడ! సోముఁడా! యనిన రంజిలుదో? నినుమించువారు లే
రీమహి నీకునీవె తగు నీడనఁగా మదిసంతసింతువో?
పామరు లట్టులే వినుతిపాఠము లీవును మెచ్చుకొందువే?
యేమెయిసేవ నీహితమొ? యేర్పడఁబల్కఁగరాదె? మాధవా! ॥52

ఉ॥ నీవుగ్రహింపఁబోవనెడునిశ్చయమున్నను మంచిమంచివే
వేవియొ యేటితెచ్చి కడునెక్కుడుభక్తిని జేయిఁజూపి యా
యావరణీయవస్తువుల నన్నిఁటి మేమెగ్రసించుమాత్రకే
లావుగసంతసింతువె? భళా! యిదినైజమె యెందు? మాధవా! ॥ 53

శా॥ నాలోనుండెడు నిన్నుఁ దుష్టిపఱుపన్ సౌఖ్యంబులం దేనె ని
త్యాలోలాత్మతనున్న నీకునుసుఖం బత్యంతమౌగాదె? యా
లీలన్ వాయువు నన్నపానములునున్ లేకుండఁగా మాడి నీ
కేలగ్గిచ్చినవారలయ్యెదరయా? ఋష్యగ్రణులు మాధవా! ॥ 54

శా॥ పోని మ్రొట్టులగాక కట్టఁ దిన సొమ్ముంగూర్చుకోలేని య
జ్ఞానాశక్తులకై నిజార్జితములోనన్ గొంతవెచ్చింప తా
నేనిన్ సౌఖ్యమువీడి పిల్చులుప నౌనే నీకుసంతోష మో
దీనానాథజనార్తివారణయశోర్ధీ! చిన్మయా! మాధవా! ॥ 55

చ॥ వినుతి సహస్రనామముల వేయివిధంబులఁజేయుకంటె నొ
క్కనికిఁ దదార్తిపోనడఁపఁ గల్గినసాయమొనర్ప ధన్యవ
ర్తనమని నీకు హెచ్చగుముదంబిడుటంచు దలంతుఁ బొట్టనిం
డునె పదివేలురిత్తలునుడుల్ పచరించిన నీకు మాధవా? ॥ 56

శా॥ తాలన్ అప్పలఁగూడ నీస్థితియదార్థంబైనఁబంచేంద్రియ
శ్రీలీలల్ కనుపింపలేమి సవి సత్ప్రేమన్ బ్రదర్శింపలే
వేలా! నిన్గన మాకు నానినుతు లోయీ! యింద్రియజ్ఞానజీ
వాళుల్ మాపరిచర్య నీకొసఁగలేనా? మోద మో మాధవా? ॥

సుగంధి.॥ నీదిపేరు మాదినోరు నీతియో వినీతియో?
రాదుచెప్ప పోదుదెప్ప రాగమో విరాగమో?
యేదిలేదు కాదుపోదె హేయమో యుపాయమో?
వాదులేల సాధులీల వచ్చి తెల్పు మాధవా! ॥ 58

శా॥ ఏనింద్యాకృతినో సకాశమున కీవే తెంచి నానేరమిన్
"రానూవచ్చితి పోనుఁబోయి"తను మర్మంబాడకే చూపుమీ
నీనైజంబయి యెట్టిలోకములయందేన్ సుప్రసిద్ధంబు ని
త్యానందప్రద దివ్యమంగళకరంబౌరూపమున్ మాధవా! ॥ 59

మ॥ నినుఁ జూడన్ బెనుపొందుకౌతుకమునన్ నిత్యంబు రమ్మందు స
త్యనుకంపాగతి వచ్చెదేని భవదీయంబైన విశ్వాకృతిన్
గనుఁగోనాదునొ లేనొ? నాదయినయుత్కంఠానురూపంబుఁగా
మునుమున్నే ఘనదార్ఢ్యమి మ్మచలదాత్మన్ జేయఁగా మాధవా!

వృ॥ ఇట సుఖమల్పము భరమగుదుఃఖమె హితమిడువారలె లేరుగా
యెటఁగనఁ బాపపుపనులకు నాసల నెసఁగొనఁజేయుటె మెండుగా
త్రుటియును నీ వెట నెసఁగుటెఱింగియు దొరవని వేడుటె లేదుగా
అటమట మెండగు నిటఁజరియించిన ననుట నెఱుంగవె? మాధవా! ॥

మత్తకోకిల॥ అన్నివస్తువులందు నుందను టాలకించిన యాదిగా
నెన్నరాని కడిందిచింత వహించెఁజిత్తము నిత్యమే
మన్నమున్ బచనంబొనర్చెదునప్పుడున్ దినునప్పు డీ
వెన్నిబాధల నొందుదోయని యేమిసేయుదు మాధవా! ॥ 62

శా॥ అయ్యో! మాయతిచారసంజనితరోగాక్రాంతి నీవెంతఁగా
డయ్యంగల్గునొ? మాకురాశఁ దగవాడన్ గల్గుపోరాటలన్
బ్రయ్యంబడ్డయశక్తుతో నెటులుగాఁ బ్రాణంబు లీవీగదో?
అయ్యా! దుర్భరగర్భవాసముల నెట్లల్లాడెదో? మాధవా?! ॥ 63

శా॥ సృష్టింగల్గెడిజీవకోట్ల సుఖసంతృప్తుల్విశేషంబులే
ర్కష్టంబుంబడువారె పెక్కు రఖరాక్రాంతిం జెలంబొంద నీ
కిష్టంబయ్యెనె? బాధ దేహమున నొక్కింతెక్కడో తోఁప ను
త్కృష్టాస్వస్థత తోఁచుమా కటులఁగాదే నీకునున్ మాధవా!॥ 64

శా॥ నీవేలోకముగా భజించినను రానేరా నెటోవచ్చితే
నీ వడ్డే మఱిపుట్టరానిగతి సాహ్యాష్టాత్మ జీవాళికిన్
నీవైదగ్ధ్యమదేమొకాని యరులై నిన్దిట్టువారిన్ ద్రుటిన్
శ్రీవైకుంఠముఁ జేరబంపెదవు దాక్షిణ్యంబుతో మాధవా! ॥ 65

శా॥ ఐదేళ్లప్పుడె తండ్రిహింసలకు జంకన్ మాఱెలే కడ్డు నీ
పాదధ్యానసమాధి నిన్గొలుచునా ప్రహ్లాదు సంసారదు
ర్వ్యాదోరాశినిద్రోసి తజ్జనకు నీకత్యుగ్రవైరిన్ దయా
ప్రాదుర్భావత నిట్టె మోక్షమునకంపన్ న్యాయమే మాధవా! ॥

ఉ॥ అంతటిచిన్నవాఁడె ధ్రువుఁ డట్టు లనన్యమచంచలంబు న
త్యంతపవిత్రమాత్మకృతమైనమహార్చన నిన్నుఁగొల్వఁ గ
ర్మాంతముదాఁక నేలుమని యల్లన మాయనుద్రోసినావు దు
ర్దాంతునిగంసు వెంటనె సుధర్మకుఁబంపితివెట్లు? మాధవా! 67

చ॥ వినయము ప్రేమ భక్తిఁ బ్రభవించెదుత్వద్గతమానసోరువ
ర్తనములకంటెఁ జూడ శతధాబలవత్తరగాఢతీక్ష్ణభా
వనమును బెంచు నీపయిని వైరసమాకలనంబుఁబూన నం
చును దినచర్య స్వానుభవశోభ నెఱింగెదనయ్య! మాధవా! ॥ 68

వృ॥ బలిమారల౯ మఱిభంగపడ౯ గనుపట్టవు నీ వొకనాఁటికే
నతిక్రూరత్వమునంది శఠించినయప్పుడుగాని జనింపదే?
మతి నాపై దయ? మాటలికేటికి? మౌనముమాని వెలార్చెద౯
శతధా నీదగుశక్తిసమస్తముఁ జక్కననిల్వుము మాధవా! ॥ 69

మ॥ గురుఁడౌశుక్రుఁడు మోసమౌననిన సంకోచింప కత్యంతభ
క్తిరసావేశత వానిసర్వమును నీకే ధారవోసెంగదా!
సరసుండై బలిచక్రవర్తి యది నీశౌర్యార్జితంబట్లు ని
ష్కరుణ౯ వానిరసాతలంబునకుఁద్రొక్క౯ బాడియే? మాధవా! ॥

## రథోద్ధతము

ఇంటిగుట్టు బయలెక్కనంచునా తుంటరీ! తిరిగితోఁచె దాత్మలో?
నంటియుండు మట నాడకీడకు౯ గెంటిపోక పరికించి మాధవా! ॥

మ॥ నినుదూఱన్ మనసౌనె నాకిచట నానిశ్రేయసాధానవ
ర్తనపుండిట్టపుఁబట్టుగొమ్మవు దురంతంబైన ప్రారబ్ధవా
హినికిన్ దేపవు సంచితోపలచమూహేరాళవర్షంబునా
పను వజ్రాంచితఛత్రతుల్యుఁడవునై వర్తింతు వోమాధవా! ॥ 72

వృ॥ నాకాహారము పానీయంబును నర్మసఖిత్వమె కాక యా
లోకింపఁబడి చేకోఁగాఁబడులోకములన్నియు నీవెగా
శోకాద్యుగ్రవికారాదుల్ నినెచూపును మిక్కిలిప్రాపుగా
నాఁకొంటింగడు నీకై నిన్విడనాడసహింతునె మాధవా? ॥ 73

శా॥ నేనే నిన్హృదినాపి యెచ్చటికినేనిన్ బోవనీనంచు దు
ర్మానిత్వంబునఁ బల్కనెప్పుడును సమ్మానార్హులై భక్తిని
ష్ఠానూనత్వముతోఁ జెలంగుమహితుల్ చాలంగనున్నార ల
ట్లైనన్ నీవు సహస్రధాముఁడవు కావా కోరినన్? మాధవా?॥ 74

వృ॥ నీదాసదాసానుదాసాంఘ్రిరేణ్వామనిన్ శ్రేష్ఠమౌసం చెదన్
నేదాల్పఁగాఁజాలుసర్వాత్వసిద్ధిన్ మహిన్ నిత్యముంగోరెదన్
గాదంచు నీవట్లుపోఁగాదటంచున్ దెగం బల్కనేనెప్పుడున్
నీదండయున్ వారినిర్ణిద్రమౌ ప్రేమనే కోరుదున్ మాధవా! ॥ 75

చ॥ కదలఁగనీక పెన్విసువుగాఁగనుపింపఁగ నిన్ను నెట్లునా
హృదయమునందె నిల్పుటలు హింసయొనర్పఁగఁగాదుసు మ్మనం
తదశల నీ వనంతగుణతన్ సుఖమొందెదుగాదె నీకు నె
య్యదివిసుగయ్యెడున్ బహుదయాపరచిన్మయమూర్తి మాధవా?॥

పంచచామరము॥ అనాథనాథ! సర్వకారణా! భయాపహారణా!
ఘనాఘనాశకానురాగగౌరవ ప్రసారణా!
మునీంద్రవంద్యవేదపాదభూతకృద్వసుంధరా!
దినేంద్రకోటితుల్యదివ్యదీప్తతేజ! మాధవా!॥ 77

చ॥ పిలిచిన మాఱువల్కవని ప్రేమమెయిన్ జనుదేవటంచు కొం
దలపడితిన్ బహిర్విలసనంబుల నీపొడఁ బోల్చలేక, లో
పలఁగల నాసహస్రదళ పద్మమునన్ సుఖముండి హృణ్ముఖో
చ్చలనజనాదరూపమున సన్నిధినిచ్చు టెఱుంగ మాధవా!॥ 78

వృ॥ కడున్ బసితనంబునుండియును మేల్కరుణ పైవారఁగా
వడిన్ జెడుగొనర్చువేళలను సుస్వరము పెంపొందఁగా
ముడుంగక సదా చెవిన్ హితముగాఁబొనరదే కీడగున్
సుఁడీ! యనెడి యంతరాత్మగతిఁ బోల్చుదునెనిన్? మాధవా!॥ 79

ఉ॥ ఊహల నొచితిన్ నుడులనొప్పుగుపొందిక నిన్నుఁగొల్చు స
న్నాహమునన్ వినమ్రతయు నెల్వురుమెచ్చెడు లాగొనర్చు మే
లాహస మున్నెనాకనుచు జంకెద; నెవ్వరిమెచ్చుకోలు నే
లా? హృదినున్ననీకు హితమైనఁ; గృతార్థుఁడ నౌదు మాధవా!॥

మ॥ పొడవో పొట్టియొ లావొ సన్నమొ సుఖంబో కాదొ భాగ్యంబొ లే
మిడియో నేర్పొ జడత్వమో రసమొ తన్మిథ్యాత్వమోనాఁక యె
ట్టిడుపీఁ డన్ వగలేక మేలుపరిపాటిన్ గూర్తు నీప్రేమ మె
ప్పుడు; వ్యత్యాసము వారివారికృతి సంభూతంబెగా మాధవా! 81

## వంశస్థవృత్తము.

సమస్తవిద్యాసరసప్రసారకా! సుమంగళప్రాంశువసుంధరాధిపా!
భ్రమజ్జనోత్తారణపాండితీధురా! నమోనమస్తే నతనాథ! మాధవా!

చ॥ కరములుమోడ్చి నిశ్చలతఁగైకొనినిల్చుటె నీదుసేవయై
వఱలునె మాకుఁ జేరజని పాదములొత్తుటొ డప్పిపోవఁగా
సురుచిరనీరమిచ్చుటయొ చొక్కఁగ వీవన వీఁచుటో యొకం
డెఱుగము నీదుపోబడి విశృంఖలవేగమునొంద మాధవా! ॥ 83

ఉ॥ సన్నిధిలేదు సేవకను జాలి ప్రమాదఫలంబెగాక యే
మున్నది? చూడ నీచరణమొక్కటికే ధరచాలనప్పు డో
యన్న! తరంబెఱుంగని యపాశ సలంపురు చుంటెగాదె? యా
పన్నజనార్తివారణశుభాకృతి రాగదవయ్య! మాధవా! ॥ 84

చ॥ పఱపినసృష్టి తన్నియమబద్ధముగాఁ గొనసాగుచున్ దదం
తరములనున్ననిన్ను బహుధాపరిచర్యలఁ జొక్కఁజేయఁగాఁ
బరవశమైనఁ గన్మొగిచి భవ్యసుషుప్తిసుఖంబుఁజెందెదో
మఱలని దివ్యయోగికసమాధి సమాహితవృత్తి? మాధవా! ॥ 85

శా॥ ఏలా! లేవవు! మత్తకోకిలలసాహిత్యంబుఁ బాడన్ శ్రమల్
ప్రీలం జక్కనిపంచచామరములన్ వీవంగఁ బల్లావులన్
గ్రాలంజాలినచంపకోత్పల సమర్చన్? మేలుమత్తేభశా
ర్దూలాక్రాంతినిగాని లేవవొ? లగింతున్ వానినిన్ మాధవా! ॥ 86

వృ॥ వృత్తములలోనఁ బరమోత్తమపరిమళము హత్తు
కుసుమాఖ్యముల తావియున్
జిత్త మిగురొత్త నుడినెత్తు ద్విజసత్తముల మొత్తముల
రాగముల యీవియున్
సత్తువలెసంగ నినునెత్తుకొనిస్వారిజనుమత్తమృగరాజములకీవియున్
గుత్తముగనుండునని యిత్తరిరచింతుఁగృతిఁజిత్తమునకెక్కెడినె?మాధవా!

శా॥ సర్వజ్ఞుండవు సర్వశక్తుఁడును నీస్వాధీనముల్ గుంపులై
సర్వజ్ఞానములున్ సమగ్రగతి నీసాన్నిధ్యముందాడునం
తర్వాణీంద్రుఁడవైన నీకు రుచియౌనా? వచ్చియున్ రాక నేఁ
బర్వంజేసెడిపద్యవైఖరులు నాభావంబులున్ మాధవా!॥ 88

గేయం॥ ధ్యానమనుకొల్మినీగానమనుమేల్మినిడిదానిపయిఁదాల్మిమెయి
నూహాలన్ । సాన రుచులీనఁగాసూనములుగా ద్విజవితానములుఁగా
మృగవిధానముల్ । గా నతులవీజనల్గా నెనయ మల్చికళలీను సొగ
సైనపెనుహారమున్ । బూనికనొనర్తు నింపౌనె? ధరియించెదె?
యనూనదయజూపుపస మాధవా!॥ 89

చ॥ లలిఁగొని చూపుమేర కవలంగలవానినె చూడలేను భూ
స్థలి నిఁక విశ్వరూపునినుఁ జక్కఁగఁ గన్గొననౌనె? తోలుచూ
పుల ననుమాఱులే కెపుడుఁబోరుదుఁ జూపుము నీదురూపటం
చలవికిమీఱునాశ నపహాస్యుఁడనయ్యెదఁ జూడు మాధవా! 90

చ॥ ముకురములోనికొండఁ దనమూపున కెత్తుమటంచుఁ బోరుబా
లకువలెఁ గొంచెపున్ జగముల్ ప్రతిబింబితమౌ భవద్విరా
డ్వికటతరోరురూపమును బట్టయతించెదునామమూర్ఖవ
ర్తకమునకున్ హసింతువె? నిరంజనభాస్వదభిజ్ఞ! మాధవా!॥ 91

శా॥ నీలావణ్యము చిత్తమోహకముగా నిండై నభోవీధి నా
లోలచ్చిత్రకళామణిప్రభ సమాలోక్యార్క సన్నాహసు
శ్రీలన్ నిత్యము విందొనర్ప మఱివేరే? విశ్వరూపంబు? మా
యాలీలన్ భ్రమఁగొంటెగాక బహురమ్యావిష్క్రియా! మాధవా!

మ॥ బహురమ్యాకృతులన్ మనోహరబహుధ్వానప్రసక్తిన్, శ్రమా
పహామందానిలపాళి రుచ్యబహుసద్వస్తుక్రమాళిన్, ముహు
ర్ముహురానందమొసంగు సేవనల మమ్ము న్నిత్యమున్ సాకునీ
కహాహా! మేమొకసేవఁజేయఁగలమయ్యా! పూనినన్ మాధవా!॥ 93

ఉ॥ చేఁపినపాలు బిడ్డకిడి చెందు సుఖంబును మాత; నీవున
ట్లే పలురీతులన్ మమతలెక్కఁన మాకొనరించు సేవలన్
గైకొనరించు సమ్ముదముఁ గాంతువుగాక, సుఖంబు నీకునీ
వోపినసేవఁజేయఁగల యొద్దిక మాకడనున్నె? మాధవా!॥ 94

మ॥ కరతాళంబులుఁ గంఠగానములు నాల్కన్ గైతలున్ గాళ్ళన్నృ
త్యరవోద్రేకముఁ గండ్లనిశ్చలితయోగాసక్తమౌచూపు మేన్
గరి సర్వోన్ముఖవృత్తిఁ జిత్తము నినున్ గాంక్షించుచో నైనసం
బరమున్నీవును గొంతఁగైకొనఁగరమ్మా! మేలగున్ మాధవా!॥ 95

మ॥ ఎపు డీహృత్పుటి నీదుచింతనము తేకెత్తున్ మహానందమై
యపుడే దివ్యకళాఢ్యమాదివము తద్వ్యాహారముల్ సున్నలై
నపుడే దట్టపుఁగారుచీఁకటి వికారాదుల్ హృదిన్ మూఁగు టీ
విపరీతంబులఁ గ్రాఁగలేను హృదినీవే నిల్వవే! మాధవా! ॥ 96

చ॥ క్షణికకళాంశకాలమును సన్నిధితప్పినయే క్షణంక్షణం
క్షణయను ప్రోతలన్ బహువిధంబులఁ జుట్టునుమూఁగి లౌక్యదు
ర్గుణములు పెన్నడుల్ నెఱపి గోడునముంచ యతించు తన్నివా
రణ మతికష్టసాధ్యమగు రమ్మిట నాదుకొనంగ! మాధవా! ॥ 97

మ॥ ఉదయంబౌరవియుగ్రదీప్తులకె పాయున్ గారుచీఁకట్లు నా
మది నీనీడ యొకింతసోక నటులే మచ్చెన లేకుండ దు
ర్మదముఖ్యంబు లడంగినాశనమగున్ రాత్రిందివద్వంద్వకా
పద లేకుండ సతంబు నీస్మరణకున్ బ్రాపీఁగదే మాధవా! ॥ 98

మ॥ అదె దీప్తాకృతు లాకసంబున సహస్రానేకముల్ గుంపులై
యుదయాస్తంగతిలేనిదీప్తులఁ ద్వదీయోపాసనానందసం
పద నృత్యంబునొనర్చు పెంపు లెసఁటన్ వర్తిల్లుఁగన్మ్రోసినన్
సదయా! కన్నులవిప్పునం దదియెకాంచన్ జేయవే! మాధవా! ॥ 99

శా॥ జ్యోతిర్గోళశతంబు లాకసమున్ జొత్తెంచి రివ్విప్పనన్
జేతోమోదముగాఁ జరించి తమకంబెన్ గోటిరెట్లెక్కుడౌ
నీతత్వప్రభలోనఁ జేరుటలు కంటెన్ నామనోవీథి నా
రీతిన్ నన్నునుఁ జేర్చుకోఁగదవె తండ్రీ! నీమెయిన్ మాధవా!॥100

ద్రు॥ వి॥ మధురవీక్షణమండితపావకా! మధురవిగ్రహమానితభూకళా
మధురకార్యసమర్పితమానసా! మధురభక్తిసుమప్రియ! మాధవా!॥

ద్రు॥ వి॥ కరుణ నీకడకన్నుల జారఁగా వరసుధారసవర్షము లోకమున్
బరమసౌఖ్యశుభస్థితి నిల్పెడున్ దరరథాంగగదాధర! మాధవా! ॥

ఉత్సాహ॥ స్వామి యెందు జడతలేనిభక్తి సంతతంబు నీ
నామకీర్తనమునుబూని నాదునిత్యసద్విధిన్
నీమ మొప్ప నసదుమాని నెగ్గఁగల్గు ధార్ఢ్యమున్
బూమెలన్ని యెఱుఁగఁజాలు బుద్ధినీవె! మాధవా! ॥ 103

పృథ్వి॥ అమూల్యమగు నీ కృపామయకటాక్షరోచిర్గతిన్
భ్రమామఖహిమప్రపంచకవిపాటనం బబ్బుటన్
శమాదిసుగుణాఢ్యులై మును లెసంగి రుద్యత్ప్రభన్
నమోనమ! తరింపఁజేయుమి! యినప్రభా! మాధవా! ॥ 104

చ॥ భువననిదాన! దానవవిభుక్రథన త్వరమానమానసో
త్సవబహుమానమానితవిధానవధానకళాభిమాన! మా
నవపరిమాణమానగణనక్రమదూరగుణాసమాన! మా
నవనవభక్తిసారకలనన్ గనమానకుమయ్య! మాధవా! ॥ 105

చ॥ విని కొనియాడి పాడి సరవిన్ విరివిన్ గని పెంచి మించు నే
వనమునఁ గూడిమాడి తెగువన్ బగవర్తిలి మున్ను సన్నవా
ర్లను ఘనధీనిదానమొనరన్ దనరించుట విన్కిఁ బూన్కి నా
మనమున నిన్నె యెన్న ననుమానము మానితినయ్య! మాధవా!॥

ఉ॥ పావనమైననీకృపకుఁ బాత్రుఁడనౌటకుఁ జేయఁదగ్గవే
వోవిధులున్నవంచు మనువుల్ విబుధుల్ వచియింత్రు వానిచే
భావము నీపయిన్ నిలుచుభంగి పొసంగుట లేదు నాకు రా
వే వినవే మొఱన్! బలుకవే తగుభక్తిపథంబు మాధవా! ॥ 107

ఉ॥ అబ్బురమయ్య! బీజమెదియైనను దగ్గతవస్తువృద్ధికిన్
నిబ్బరమైనసూటి ధరణిన్ దగుసారమొసంగుచుంట, ని
ట్లుబ్బ నొసంగుసృష్టి సమయోచితభోజ్యముగాఁగ నిల్పునీ
ప్రబ్బుదయావిశాలతకుఁ బ్రాంజలిఁ జేసెదనయ్య! మాధవా! ॥ 108

---

శా॥ సారంగంబొకఁ డాకమండలువులో సారంబులన్ గ్రోలఁగా
సారంగంబులు మూఁగి ఝంకృతిఁ గళాసారంబు రూపింపఁగా
సారంగంబులు డాఁగి జూటమున సంసారంబు సాగింపఁగా
సారంగుం డెలుఁగండు యోగి తమసాసారంబునన్ మాధవా! 6

మ॥ అటు సత్యవ్రతనాముఁడై వెలయు పుణ్యాత్ముండు నిత్యంబు సం
కటసంహారు కృపామృతాంచితకటాక్షప్రాభవోదారు నె
న్నుచె కార్యంబుగనుండి యోగహితసంతోషంబు పెంపార నా
తటినీతీరమునందుఁ దానపరసంధ్యన్ వార్చుచో మాధవా! 7

ఉ॥ ఆజపశీలి సాంఖ్యసమయార్థవిధు ల్ప్రచరించుచుండ నీ
రేజము లంతలో మొగిడెఁ బ్రీతిఁ దలిర్పఁగ సాగెఁ గల్వ లం
భోజహితుండు నస్తగిరిమూఁపు దెసన్ దిగుచుండె మింట వి
భ్రాజితమయ్యె మోహనజపాకుసుమారుణకాంతి మాధవా ! 8

ఉ॥ సారససీమలందు మధుసారసమాదృతిఁ జొక్కి మోడ్పుచే
కూరుట నందుఁ జిక్కి పలుకూరటలన్ వెలిపోకఁ దక్కి ఝం
కారత నిక్కి షట్పదవికారరవంబులు శైవపాద ని
స్సారితపంక్తికంఠగళచారిని నాదము లయ్యె మాధవా ! 9

ఉ॥ పెద్దదియౌ దివాకరుని బింబములో సగపాలు గ్రుంక మే
ల్బుద్ధి మునీంద్రుఁ డస్ఖలిమిదుపూన్కిని దోసిటనీటి నెత్తి య
ట్లద్దెసఁ బోయఁబోవ మనుజార్తవచస్సుల నందునుండి యా
పద్దశ "రక్ష! రక్ష!" యనువాక్యతిదీనతఁ దోఁచె మాధవా! 10

ఉ॥ దోయిలిపోబడిన్ మిగులఁదొందరతో పుతనాఁగి డింపి "యో
మీ! యిదియేరివాక్య"మని యేర్పడు వింతగగుర్పుమాటగా
నాయతి పల్కి చూచుకొన నం దొకబిత్తరిచిన్నలేతమీ
"నోయమివర్య!పాహి!" యని యూర్ధ్వముఖంబయి పల్కె మాధవా!

ఉ॥ "ఎట్టిభయంబుసోఁకె? నిను నేగతిఁగాచుట నీదుకోర్కి? యిం
పుట్టిపడన్ హొరంగుమెయి నున్నమనోజ్ఞవు నీకు నొక్కయి
క్కట్టును దోఁచెనే? పసినిగారపుకూనవు నీవుతొట్రిలన్
బుట్టినయాపదన్ దెలుపు ప్రోతు"ననెన్ జడదారి మాధవా! 12

చ॥ అనవిని మేన్మెఱుంగు చలనాప్తిఁ దళుక్కులనీన, మోదమె
చ్చినమది "నేమి నేమనవిఁజేసెదనయ్య! జలంబులందుఁబు
ట్టినమొదలింతదాఁక నొకటేదినగండము కాదుకా దను
క్షణమును గండమయ్యె" నని జాలి వచించెను మీను మాధవా !

చ॥ పగిలినగ్రుడ్లనుండి వెలిఁబడ్డసహోదరులేను వేలు వే
లుగఁ, బురిగట్టి తోరణములోయన, మిన్కులచాల్పునాఁగ నొ
త్తగుసవరత్నసంఘటితదామములోయనఁగాఁ బ్రవాహరీ
తిగ జలగర్భసీమలను దిర్గితిమంచనె మీను మాధవా! 14

మ॥ కడుసూక్ష్మంబులు మేనులౌట, మది నోఁగాము ల్వీక్షించుచో
ప్పెడుపాటౌట, స్థమిఁ దాఁకుతప్పటలు సుంతేనెన్నఁగా లేక యే
ర్పడు కౌతూహల ముబ్బఁజేయ బురదన్ బాచిన్ శిలాగ్రంబుల
న్వడపర్యావనితిమంచుఁ బల్కె ఝష మవ్వేదాంతితో మాధవా !

చ॥ ఒకరమ లేకయిద్దరమ? యుంటిమి వేలకు వేలు, స్వేచ్ఛను
త్సుకతఁజరించుచోట మముఁజుట్టి గ్రసించెడు పెద్దమీలు నే
రకములతాలొ నాచులొకొ రమ్మని తత్పరితఃప్రసారతన్
వెకలులమై చరించితిమి వేడుకనంచనె మీను మాధవా! 16

ఉ॥ భూరిఝషంబు లుర్వడిని బోయెడుత్రోవపుడుఁ బాటినెట్ట నా
దారి ననేకము ల్వివశతన్ విపర్యాసములందుజారి యా
హారములయ్యె వానికి, జలాగ్రతలంబుల సంచరింపఁగాఁ
గోర విహంగబాధ వెటఁగొల్పెననెన్ జలగామి మాధవా! 17

ఉ॥ పైకెగుర న్విహంగములబాధ జలాంతరకర్దమస్థలిన్
దాఁగొనఁ బెద్దమీ లొసలికాటులుఁ దప్పవు, తీరసీమలన్
బ్రాకఁగ జాలరుల్ దటిమిపట్టుచు రిట్లచేతఁ బ్రాణము
ల్బోనకుట కెన్నినాళ్ళొ? యనె, సాధున కాఝష మప్డు మాధవా!

చ॥ "తలఁచుకొనంగ నాకడుపు తద్దయు వ్రయ్యఁగఁబడ్డయట్టులై
కలఁగుమనంబు నోటఁదడికన్పడ దంగిలియూరు మేను మూ
ర్ఛల వివశత్వమూను బుషిసత్తమ! యేమనివిన్నవింతు నా
బలగముగాథ!" యంచనియె వాలుగ తేఁగినచింత మాధవా!

ఉ॥ ఆకృతిసొంపుఁ జూచి సమయజ్ఞవచోవినయంబు నెంచి చి
త్రాకృతి నంతకంతకు మహాద్భుత మాత్మ నెసంగ నిల్చి "య
ప్రాకృతమత్స్యరాజ కుఁడి, వచ్చె నిటుల్ సనుఁగన్నతండ్రి ప
న్నకరణిన్ గృతార్థిత భరింపఁగ" నంచనికాని మాధవా! 27

ఉ॥ నెట్టన గట్టిభక్తి నెద నిరుసమస్కృతిఁ జేసి, మీనుతోఁ
"బుట్టకమున్నె నేర్చితివొ? పుట్టియె నేర్చితొ మున్నుమాటలం
గిట్టిగఁ జాలు పల్కనుడికారము, నిష్టను నిండుగా జె సి
యుట్టరుతోఁడి పాత్రు ఋషమా!" యనె నాశమునీశ మాధవా! 28

శా॥ ఆక్షీరోదధి శేషపాన్పు పయి నొయ్యారంబుగాఁ బ్రాలి నీ
కుక్కంగల్గు సమస్తగాత్రవితతిన్ గొప్పాయసం బూను నీ
కక్షుద్య్వంబనుచున్ గమండలువునం దారా హృషీంద్రుండు తా
నిక్షేపించి నెంతసంతసిలితో నీవా యెటుల్ మాధవా! 29

ఉ॥ భక్తిఁ బ్రపత్తి నీదయకుఁ బాత్రుఁడు గాఁదగువాని మించునా
సక్తిసహించి యిట్లు సరసంపు విలాసమునన్ గ్రహింతు వో
ముక్తినికేతనా! విషయమోచన! సంశ్రితరక్షణక్రియా
సక్తసుధారసప్రసరచారువిలోచన! శ్రీరమాధవా! 30

ఉ॥ అంతట సాంఖ్యకృత్యముల సన్నిటఁ దీర్చి నృపష్టచంద్రుఁ డా
ప్రాంతమునందె యున్నతసయాశ్రమమున్ దరియంగ నేగు న
ల్లంతనె మీను నీర్పుటికనంతట నిండి వచించెఁ "దండ్రి! నా
కింతయొ సంభవించె నిటు కింపు, వెలార్పవె" యంచు మాధవా!

చ॥ అదివిని యేమిచోద్యమిది యంగుళియంతది యింతలోన ని
ట్లెనుగునె? మద్గురుండు జగదీశ్వరదివ్యవిలాస మార! నా
హృది ముదముబ్బసాగ" నని హెచ్చిన భక్త్యనురాగజాతగ
ద్గదిక నెలుంగు తాల్పడఁగ దాని వెలార్చి వచించు మాధవా! 32

ఉ॥ మున్నెపు డిట్టివింత కనమున్ వినమున్ ఋషరాజ! నీశరీ
రోన్నతి నాకపూర్వమయి యొప్పె, విచారణఁ జేసి చూడఁగా
నిన్నొకమీనమాత్రునిగ నిశ్చయమున్ బొనరింపరాదు లో
కోన్నతిఁ గూర్ప వచ్చు భువనోదరమూర్తివిగాని మాధవా! 33

చ॥ అందముగాఁగ నర్ధశశియాకృతులై బహువర్ణకీర్ణదీ
ప్తిం దనరారు మైపొలసుతీరులు బారులుబారులై మెయిన్
గ్రందుగఁ దళ్కులీన నినుఁ గన్గొనఁ గన్నులఁబండువయ్యెఁ జె
న్నందినచేపమిన్న” యని హస్తములన్ గొనె మౌని మాధవా! 34

ఉ॥ కమ్మనితేటనీట నొడికమ్మగు లోతువెడల్పుపాత్ర మ
త్స్యమ్మిడి తత్ప్రచారముల కద్భుతమందుచుఁ గొంతసేపు కం
దమ్ముల మూసి తావకపదమ్ము లచంచలచిత్తవీథి న్నృ
త్యమ్మొనరింప భవ్యసుఖతానుభవంబున నిల్చి మాధవా! 35

ఉ॥ ముట్టినఁ జిన్గునో యనెడి ముగ్ధల పల్చని లేఁత ఱెక్క లి
ట్టట్టుఁజలింప మించిన నొయారపుతిర్గుడుబోక కెంతయున్
బట్టగు తోఁక కుంచెవలెఁ బల్మరునున్ వడుపూనియాడ నే
ర్పుట్టిపడన్ జరింతు వహహో ఝషమా!” యనెమౌని మాధవా!

ఉ॥ దైవమ! నన్నుఁగన్నదొర! తావకచిత్రచరిత్ర లోకసా
ఖ్యావహసత్ఫలంబగుట నాగమముల్ వచియించు స్వామి! ము
ఖ్యావసరంబు సన్నిహితమై చనుదేరఁగఁబోలు నిప్పుడీ
వే వసుధన్ జనించుపని కెత్తుటయున్న మఱొంట మాధవా! 37

చ॥ అనుచు సమగ్రతన్ హృదయమంతయునిండిననీదు విగ్రహం
బునఁ దగులొందియున్నముని మోదప్పుఁగనుల్ వికసింపఁజేయ నెం
దును భవదీయవిగ్రహమెతోఁచె ఝషంబునుపాత్ర, నీరుఁ, దా
ననిమెదు లౌక్యచింత సమయన్ జరితార్థుఁడతండు మాధవా! 38

మ॥ భువనాభిన్నవపుర్విలాసములతో భ్రూమధ్యసంసక్తదృ
ష్టివిశేషుండగు యోగిపుంగవునకున్ శ్రీమంతమైవెల్గు నీ
యవినాభావతఁ దెల్పినావుగద ధ్యానాభ్యాససంప్రాపణీ
యవిభాపుంజమ! భక్తిపుష్పమకరందావేశితా! మాధవా! 39

శా॥ ఆసీభక్తుఁడు తన్మయప్రతిభవాఁడై యెంతసే పట్లు నీ
ధ్యానాసక్తినినిల్చెనో యెఱుఁగఁ డంతన్ “దండ్రి! యీపాత్ర నా
కూనంబై మెసలంగనీయదుగదే యోహ్వాని విశ్రాంతి నెం
దేనిన్ జూపు” మటన్నమాటుమొఱ కెంతేత్రుళ్లునన్ మాధవా!

శా॥ ఆదీనోక్తులు తాను కన్గొనెడి దివ్యాకారుఁడే పల్కిన
ట్లై "దేవా! యిదెవచ్చితే' ' ననుచు గాఢాలింగనోద్యుక్తుఁడై
మీఁదన్ గల్గిననీటిపాత్రమును బల్మిన్ గౌగిలించెన్ రసో
న్మాదుల్ కాంతురె భేదబుద్ధిఁ బరమాత్మా! మోక్షదా మాధవా!

చ॥ క్రమముగ విశ్వరూపమును గైకొనియున్నమునీంద్రుదృష్టి సం
యమనమునొందఁ దార్క్ష్యచరుఁడై పరమాత్మ రమావిలాసి నృ
త్యములఁ బురోగతుండయినయట్లుఁ దలంచి యొకింతదృష్టిని
ల్ప మఱలఁ బ్రాకృతప్రతిభవాఱఁగఁ దేఱె యతండు మాధవా! 42

ఉ॥ ఆయతమైనపాత్రపయి సంతతనిండినమేనితోఁ దను
చ్ఛాయ లపూర్వదీప్తుల దెసల్ వెలింగింపఁగఁ దన్నుఁ జూచున
మ్మాయజలేచరంబుఁగని "మామ్మఁగదే! తడవయ్యె నింకని
న్నేయెడనుంతు దీర్ఘికయిదే తగు"నంచని మౌని మాధవా! 43

ఉ॥ బట్టనుగప్పి పాత్రఁదలపైనిడుకొంచును వాపిఁజేర్చి స
మ్రాట్టగు లోకమోహను కరంబుమెలంకువమీఱఁదీసి జే
పెట్టెడు స్వస్తివాక్తతుల భృత్యవిధేయతవెల్ల నీటిలో
నెట్టనడింపె మెత్తపయి నిల్పెడులాగున మౌని మాధవా! 44

మ॥ "జనకా! ఆశ్రమసీమ నీశుభకళాసాంగత్యముల్ కొన్నినా
ళ్లనుభూతంబులుగా నెసంగ భవదీయంబైసచిన్మూర్తికిన్
మనఉత్సాహముగాఁగ సేవలొనరింపన్ వచ్చునంచున్ ముదం
బున నుప్పొంగితి నన్నువీడిచనెదేమో యింతలో మాధవా! 45

శా॥ నాకున్ నీకు విధాతృసంకలన బాంధవ్యంబుచేకూరె నం
చోకళ్యాణగుణా! వచించితివి యేనోయంచు నాసాసలన్
రేకుల్వాఱుప్రమోద మందితిని తండ్రీ! దాని కిట్లింతలో
నే కల్గన్వలెనే విఘాత మహహా! నీచిత్రముల్ మాధవా! 46

శా॥ అయ్యో! పోయితెనీటిలోపలికి రావా!పైకి నీవింతలో
వెయ్యార్లైరె బుడగల్ జనించెడిని యూరిన్ మున్గినావేమొ నా
కుయ్యిన్ నీవటనాలకించెదవె? యీత్రొత్తెవ్వరోయంచు నీ
కయ్యోబాధల స్థానికాంబుచరముల్ ప్రీఁగొల్పునో మాధవా! 47

ఉ॥ రాజసమున్ దయాగుణము రాజిలు నాముఖసీమనంటి వా
తేజున రక్షణక్షమత నీపితమంటివి చేపకూన! నా
మోజులమోజుదాన! నినుఁ బ్రోచుటమానుగఁ జేతులార నీ
యోజ నినున్ ద్యజించితి నయో! యెటులుంటివొ లోన మాధవా!

మ॥ బహుకాలంబుగ నిందులోఁ బెఱిగి ప్రాబల్యంబునున్ జేన స
స్నుహాసప్రోషిమ స్వేచ్ఛతోఁ దిఱుగు మీనంబుల్ నినుంబట్టునో
కుహనారంభములన్ శరించి సిలుగుల్ గోరంబులుం గూర్చునో
స్పృహలే కిందులదింపినాఁడ నికనాకృత్యంబెటో? మాధవా! 49

ఉ॥ నిష్ఫలబాణముల్ పఱపి సిరము లింకనొసర్తునన్న నా
యుప్పువు నీకసౌఖ్యమది, యయ్యొ! యెఱుంగక బుద్ధిజాడ్యతన్
ముప్పున నిన్నుఁడింపి యిట ముచ్చటలాడుచునుంటి నెట్టులే
త్రిప్పుల లోఁ శ్రమంపడెదో? నీతనన్నుఁ దలంతొ? మాధవా! 50

చ॥ వలవలెఁ జిక్కి ముళ్లు పెనఁబడ్డలతాపులలోఁ సడక్కి రా
మెలపు నెఱుంగ కందుల భ్రమించుచునుంటివొ? రాత్రివయ్యలో
పలికి సదాయనన్ జని యపాయమునొందితొ? మత్స్య దానియం
సలఁ జనుదేఱ నిమ్మకనుపట్టమి? యేమొనరింతు? మాధవా! 51

ఉ॥ ఆతటివాఁడపీవె శరణంచు మదంతికమున్ జేఱ వి
భ్రాంతియొనాక, సమ్మకముపాఱినచిత్తముతోడ నంతయో
యింతయొ సేవగాఁగ రచియింతుసహాయమటంచు నాత్మలో
సంతసమయ్యెఁగాని విరసంబగు గర్వమునొంద మాధవా! 52

ఉ॥ కౌఁగిటిలోని జవ్వని యకారణమాయ నడంగ నోటిలో
నేగు గుమంగుమన్ రుచులనీనుపదార్థము జారిపోయెఁ గై
లాగిఁగనందుచుండినఫలంబుల నేఖగమో హరించె నా
హా! గతియేమి? సర్వపరిహాస్యుఁడనైతిఁగదయ్య మాధవా! 53

ఉ॥ త్రాగఁగ లేనిపిల్లివలె దైవమ! నాతగు పాలకుండనున్
బాగుగ బోర్లఁదోసితిని పై నధికంబగుఱిచ్చపాటుచే
నీగతి దుష్ప్రలాపముల నీగుచునుంటినిశన్, బ్రగల్భముల్
గాఁగఁ దలంపఁబోకు ముదకంబుల నిన్ గనవత్తు మాధవా!" 54

చ॥ అని యొకనిశ్చయంబునను నాజడదారిమనంబు వచ్చుదాఁ
క నితరచింత సుంత పొడకట్టమి నాతఁ డెఱుంగకుండె నో
డ్డునని లఁబడ్డ మాటయె కడున్ నడి నీరము పొంగిపొంగి కా
ళ్ల నెగసి జానుదఘ్నతఁ జెలంగుట నప్పుడెఱింగె మాధవా! 55

చ॥ రవచినుకైన లేదు వెలిరంగమునుండి ప్రవాహమెద్దియున్
గవిసెడు క్రంత కన్పడదు కారణమేమి? జలంబు పొంగి యి
ట్టివిధమునన్ దరంగముల డెప్పరమై తొణుకాడనంచు వె
ల్లివిరియు వింత పూన్కి మదలింపఁగ నాయతిరాజు మాధవా! 56

చ॥ వడి మొలబంటినీట డిగి బాహులసాచుచు బోర్లపాటుగాఁ
బడుచుఁ దటంబుఁ బాదముల బాగుగఁదన్ని యుసిన్ గ్రహించిపెన్
వడి జలమధ్యసీమకుఁజనన్ దగుపూనిక నీదసాగె న
క్కడమును కేసి లోన నెనుకంగఁదలంచి తపస్వి మాధవా! 57

చ॥ కరచరణప్రపాతములఁ గల్గిన సంచలనంబుచేత నా
దటిఁగల భేకమీనతతి దవ్వుగ సంభ్రమమూనిపాఱ విం
తరయమునీఱ నీదుచుఁ జనంజన నీరములోతుతగ్గ స
త్వరమగుపోక సాగమి వితర్కమునన్ మునిమౌళి మాధవా! 58

ఉ॥ వాపి యగాధవారిపరివర్తితమంచు నెఱుంగుదేను ఆ
ఆపుల నిట్టిసంకులము రావుటచిత్రము దానికంటె నీ
కోపున లోతుతగ్గుట కొకొండును హేతువ తోఁచకుండె నే
నేపగిదిన్ గనంగలనొ యుత్తరి బిత్తరిమీను మాధవా! 59

చ॥ చలమున మాయదారిజలచారమెదేనియుఁ గొత్తమీనురాఁ
గలఁగి ద్రుతప్రచారములఁ గంపముఁగూర్చెనొ నీటి, కిట్టులిం
దుల మెరకౌటకున్ గతముతోఁపదు దీర్ఘికయంతయున్ నిరా
కులమతితోఁ జరించి కనుఁగొందునిజం"బని పూని మాధవా! 60

చ॥ ఎడనెడఁ గాలుసేతులకు నింతటనంతట పోకుమిట్ట యీ
గడఁగనుఁగోదలం పెదనుగల్గుట దానిని జుట్టివచ్చుపో
కడ ముని యీదుచో నది ప్రకంపము నొంది మునింగెలోని క
ప్పుడు సుడిగుండముల్ వళులభోరు ప్రచండములయ్యె మాధవా

చ॥ మునిగిన ముక్కుకున్ జలము ముంచి దలత్తో నడిసీమ కుర్వడిన్
గొని ప్రవహించువేగమునకున్ జటి తట్టుకొనంగలేమి నం
దున సుడివెంట సారెవలెఁ ద్రోవ భ్రమించుచుఁ దానుమున్గె నా
మునుకనె నిస్పృహత్వమును ముంచుకొనన్ హతచేష్టమాధవా! 62

చ॥ పడిపడి కొంతసేపటికి ప్రజ్ఞ క్రమంబుగారాఁ గలంకమా
నెడ నిడిమిద్ధమం చెలుఁగ నేరని యాతనిచిత్తవీథి నే
తుడి మొదలున్ బొసంగని దెదోకథ గందరగోళమై పదిం
బది భ్రమఁగూర్చె వేకువనువర్తిలుస్వప్నమురీతి మాధవా! 63

ఉ॥ క్రన్నన గన్నులన్ దెఱచి కన్గొన లోకము వస్తుభేదసం
పన్నతఁదక్క మంచుతెఱ పాటిసరీతిగఁ దోఁచెఁ బుల్గు లా
సన్నదివాముఖానిలసుజాతిముదింబునఁ గూయుకూఁతలున్
జెన్నటి నాహగా జపులఁజేరె మునీంద్రున కప్టు మాధవా! 64

ఉ॥ ప్రాణములైదునున్ గుహుటఁబడ్డకొలంది జటాకలాపముల్
రాణఁదొలంగి చిక్కగ శిరంబు ముఖం బుర మంసముల్ పరి
త్రాణవిధిన్ బెనంగ మొయి దార్ఢ్యములేమిఁ గ్రియాప్రభాదరి
ద్రాణతచే నచేతనతఁదాల్చి కటింగెనుమౌని మాధవా!॥ 65

మ॥ బలహీనత్వముఁబాయ నెమ్మదిగఁ సంబాళించుకొంచున్ జటల్
దొలగన్ సర్ది ప్రవర్తితాఖిల మెదన్ దోపంగఁ జుట్టున్ గనుల్
మలయన్ ద్రిప్పి కనుంగొనన్ దెలిసె క్షేమస్థానమై యాయత
స్థలమై నీళులులేనిచోట నటులన్ దానుండుటల్ మాధవా! 66

శా॥ ఔరా! యెంతప్రమాదమయ్యెఁ! దొలిమత్స్యం బెక్కడన్ జిక్కెఁ! గా
సారంబేది? మదాశ్రమంబెచట? నిశ్శక్తింబడన్ హేతువే
దో? రమ్యాకృతులొప్పుగచ్ఛపయి నెట్లోయున్కి? నా నానిరా
శారిన్ బిట్టుకలంచె యోజన లసంప్రాప్తస్పృహన్ మాధవా! 67

ఉ॥ గచ్చిదికాదు రంగు లొడికంబుగదిద్దినతోలునాఁ గడున్
ముచ్చట లీనుచున్నయది బుద్ధికి శుష్కముగాక సార్ద్రమై
హెచ్చినచెన్ను మెత్తఁదన మెంతయునున్ను నెసంగె నిక్కమా!
మచ్చమయానొకో? మదముమాదిరి వాసనవచ్చె మాధవా! 68

మ॥ నిజమేపో! పౌలసుల్ చతుర్దశశివన్నెన్ వాసి శాసించు రూ
పుఁజెలంగన్ విరివిన్ మనోహరములై మున్నేఁగనుంగొన్న చి
న్నజలేచారము వృద్ధిఁగొన్నటుల భ్రాంతిన్ గొల్పఁగా సాగె నిం
తజయం బిట్టియదృష్టమున్ గలుగునా? నాకీయెడన్ మాధవా! 69

శా॥ పానీయంబులకో దినాంతపవనవ్యాసక్తినో చేరు దీ
కోనే గేను దినంబు నెప్పుడిటఁ గన్గో నిట్టియాశ్చర్యమా
మేనున్ దాలిచి యింతదీర్ఘతరమహామీనంబు సందేహమే
లా నాటక్కరిసామి నీకళలె కావా మేలుమేల్మాధవా! 70

ఉ॥ కానిజలేచరంబు కడగండ్లఁగలంచెనో యేమొ? పైకిరా
నీనియనర్థపూర్బి యలయించెనొకో నినుఁ? గన్నుచల్లఁగా
నేనినుఁగ్రమ్మఱన్ దఱిసి నేస్తముపెంపునసేవసేయ లే
నో నను జెందుప్రాప్త మెటులో? యనునారటమయ్యె మాధవా! 71

మ॥ నినునేఁగాచెదనం చహంకృతిని గోనెర్నిటలంఘించి యా
పెనుగర్వంబు నశింపఁ దుట్టతుది నీవేనన్నుఁగాపంగ నీ
యనువై నిల్చితిఁ జెప్పకోఁదగుర నాయార్తావనత్వంబు నీ
పెనుప్రాపుండినఁగాక మర్త్యులపనుల్ పెంపొందునే? మాధవా! 72

చ॥ నినుఁగనినంత నీరసము నీరసమైచనె నిండుచేవ మే
నున మనమందు నుత్సుకతనుంగలిగించెను తండ్రి యాజ్ఞయే
మి? నను ననుగ్రహించుకలిమిన్ సెలవిమ్మనరించువాఁడ నే
సనుటపహుళ్క్తి నీనయగుదయ్యా! యదార్థమెఱుంగ మాధవా! 73

చ॥ అని తటసీమఁజేరి వినయంబునయంబునుఁ దోఁప మోడ్పుకే
లనను దుటన్ లంగించుకొనితత్పరభక్తిఁ దదేకనిష్ఠుఁడై
కొని ముని వేచియుండఁ బలుకున్ గుహనార్ఘుపరాజు శర్కరన్
న్నినిచినస్వాదుసత్ఫలము నించురుచుల్ విలసిల్ల మాధవా! 74

మ॥ చవగండంబులఁబాపి నాకిట గడున్ స్వాస్థ్యంబుఁ జేకూర్చినాఁ
డవు సాధూత్తమ! యాచకుండెఱుఁగువాఁడా? దాతసామర్థ్యమున్
సవరింపందగు నింకనొక్కపని కాసారంబు నాయున్కికీ
డవునా? చూడుముచూడు మంచనియెమత్స్యంబయ్యెడన్ మాధవా!

శా॥ అయ్యో! నిక్కము! యెంతమందమతి! నౌరా! యింతమాత్రంబునే
నియ్యోజనసేయలేనయితి స్వామీ! స్థానసంకోచతన్
డయ్యెంగగ్గనె! త్వద్దయాభ్యాసనరూఢంబైనయోగప్రభన్
ముయ్యేటన్ నినుడింతు నాయతమటన్ మోదింతురా! మాధవా! 76

మ॥ "మునిచంద్రా! దురపిల్లఁబోకు మిపు డేఁబోవన్ గడున్ ముఖ్యమౌ
పనియొండున్నదిసప్తమంబగుదినప్రారంభమందెప్పు డెం
దును గన్గోని మహాజలప్రళయ మెంతోక్రూరతన్ రేఁగు నీ
కనువౌనావయొకండు వచ్చు"నని మత్స్యంబేగ నో మాధవా! 77

చ॥ అని చనుచున్నమత్స్యమునయందె తగుల్కొనియున్నచూడ్కి న
మ్ముని కితరస్పృహల్ సనియె ముం దిఁకనేమిమహాద్భుతంబు సే
యునో కొ జలేచరప్రభలనున్న పరాత్పరుఁ డేనుఁ దానిఁగ
న్గొనక త్యజింపనీస్థలము కోట్లకునే ననెమౌని మాధవా! 78

మ॥ కడు వైశాల్య మెసంగుచోటను రెన్ గాఢప్రమోదంబొ? దాఁ
గడఁకన్ ముం దొనరింపఁబోవుపనికిన్ గాఁబట్టియో మీన మ
ప్పుడు గాలిన్ బఱిపొంపొగోయఁగఁ బెంపుంబొంది కన్పట్టె మ
బ్బడి ముక్కాలుగ నాయతంబగు తనువ్యాప్తిన్ బ్రభన్ మాధవా!

ఉ॥ ఆయత తాళదీర్ఘమయి యప్పుడ తోఁచెను ముట్టెమీఁద ము
న్నాయినెసంగు నాయుధమువంటి దృఢంబగుకొఱయొండు మే
లై యిఱువంక వంకకొన నంచితమౌ విలువంపురీతి నిం
డై యమరెన్ బలప్రథితమౌపెనువాలము తీవి మాధవా! 80

చ॥ అది తిమియో తిమింగిలమొ? అట్టిదియిట్టిదినాఁగ శక్యమే?
యెదిరి తిమింగిలంగిలము లేనియు రావెఱపూని మూలలం
దొదిగెడు దానిధాటి కెదురొడ్డెడుసత్త్వము కానరాదు ప
న్నిదమున నైన నెట్టిపెనునీరధిలోపలనైన మాధవా! 81

చ॥ తెరచిననోటి కెట్టిపెనుదీవులు నుంద్రములంత లన్న నా
విరివి యొకింతయర్థమగు వీకున నీరముతోడ నోటిలోఁ
జొరినతిమింగిలంబు లతిచోద్యముగా సెలవుల్ త్యజించి యు
ప్పరమున కేగెడిన్ వెడలఁబాఱెడునీరముతోడ మాధవా! 82

ఉ॥ చెంపలనున్నరంధ్రములఁ జిమ్మఁ బయస్సులతోడ జంతువుల్
ముంపునఁ దీవ్రమానుసిని బోయి వియత్తలమందు రిక్కలన్
బెంపఱడాగఁగావలయు భీతిలి కానియెడన్ జలంబుపెన్
దుంపురులన్ గనంబడవె తోయముజల్లుగవ్రాల మాధవా! 83

ఉ॥ చిమ్మనక్రోవులో యనఁగఁ జెంతలరంధ్రము లుప్పరంబుపైఁ
జిమ్మినవారి తుంపురులఁజిట్లక మింటికిమంటి కాపుకం
బమ్ములపోల్కి లావులప్రభల్ వెలయున్ విలసిల్లుఁగొంతసే
పమ్మియిఁ బైన వారిదములై యుదకంబుల వ్రాలు మాధవా! 84

ఉ॥ మింటికిఁ బాఱునీరములు మేఘపథంబును దాఁటిపోయి యా
వెంట ఘనీభవింపఁ బృథివిన్ బవనాహతి వర్షరూపమై
జంటలుజంటలై పడిన క్షారవిమిశ్రితమీనఖండముల్
పంటపొలంబులై తనరెఁ బక్షుల కవ్వలభూమి మాధవా! 85

ఉ॥ వారి యవారితంబటులుపాఱుగొదన్ భువనంబుఘూర్ణిలెన్
బోరసమూర్ఛిలెన్ దెలివిపోవుట జీవములెల్ల మేఘసం
చారము మింటఁ దోరమయిసాఁగెఁ దదుద్గతవాయుసంహతిన్
దీఱునొకో జగంబు లగతిన్బడి నేఁ డనిపించె మాధవా! 86

ఉ॥ వేడుక వాల మింతఝుళిపించినఁ గొండలవంటిరూపులన్
దోడన వారిఖండములు ద్యోపథచక్రమణంబొనర్చి వే
దాడుల ధారలై కురియుఁ దజ్జలపాతవిశేషతీవ్రతన్
బాడయి లంక లంబునిధిపంకములోఁ గలియంగ మాధవా! 87

ఉ॥ అంబుధిలోమునింగి తనయాటల "హూ" మ్మనుమాత్ర వారి యు
గ్రంబుగఁబొంగి కొండలనఁగాఁ దనమట్టుమీరిలేచు, నీ
రంబుల నున్నబాడబము రౌద్రత రేఁగిసచందమౌచు, నా
యంబుచరంబురోష మెగయన్ మఱియెట్లగునొక్కొ? మాధవా!

ఉ॥ అచ్చట సోమకుండు సలిలాంతరనిర్మితసౌధపాళి సౌ
ఖ్యోచ్చదశన్ జెలంగుచు నయోగ్యతమీఱ విరించియొద్దఁదా
మ్రుచ్చిలికొన్న వేదములు ముచ్చటదీఱఁ బఠింపఁ గౌతుకం
బెచ్చుటఁ దత్క్రియాచరణ మేడ్తెరఁగూర్పదొడంగె మాధవా! 98

శా॥ ఆలో వేగరు లార్తిమైఁ దఱిసి జోహార్పల్కి దేవా! యెవం
డేలోకంబున విన్నకన్నయదిగా దీనాఁటివిడ్డూర మా
భీలప్రౌఢిఁ జనించె సప్తజలధుల్ వేగంబ సప్తాద్రులన్
దూలప్రక్రియఁ బెల్లగించు తెఱఁగై త్రోపాడునాన్ మాధవా! 90

చ॥ జలధులకున్ గులాద్రులకుఁ జాలఁ జెలంగెడి యంతరంబు మీ
కలతఁ ద్యజించి యెద్ది యెటఁగాంచితి రయ్యది యున్నయట్లుగాఁ
బలుకుఁ డటన్న సోమకునిబంటులు ప్రాంజలులై మహేంద్ర! యే
పలుకులఁ దెల్పఁగాఁగలము వర్తిలు ఘోర మటంచు మాధవా! 91

ఉ॥ ఆరుదినంబులయ్యె నొకయంబుచరంబు హిమాద్రిమించు వి
స్తారవపుర్విలాసమునుదాల్చి విహారమొనర్పసాగె ము
న్నీరమునందు దూరమున నిల్చి భయంపడి పాఱఁగాని వా
ర్చారము లెట్టివే నెదురఁజాల వటంచనిరష్టు మాధవా! 92

ఉ॥ “సిలిగి యావులించినను నిక్కముగాఁగఁ గులాద్రులేటికిన్
జాలినయంతనోరు, వెలుచన్ బెనువాలము సంచలించు నా
భీలతకున్ వసుంధరయు విశ్వములోనిగ్రహంబు లల్లక
ల్లోలమునొందున ట్లతిబలుండు గ్రమించు” ననంగ మాధవా! 93

చ॥ తటికిమోడుదానిధాటికి యదాయదలై తగుఁగాదునాఁక పల్
డెఱఁగులఁ గాఱుమీలు జలధిన్ విడి మీదికి దూఁకుచుండు నా
తెఱఁ గనలాచలప్రళయదీప్తి ద్రవీకృతభూరిలోహముల్
తఱుచయి కేఁగుభాతి భయదక్రియఁ గన్పడు”నన్న మాధవా! 94

మ॥ “అదియేచిత్రము దైత్యదానవరహస్యావాసముల్ ప్రౌఢిమీ
రుదటిన్ మాత్రమె సంచరించునది తద్రోషంబు నోపంగ లే
క దెసల్ పట్టిరి పోటుబంట్లయిన రక్షశ్శ్రేష్ఠు లోసామి! యా
యుదధిన్ నిల్చిన దీపురంబె యిటకెట్లోవచ్చు”నాన్ మాధవా! 95

ఉ॥ తొందర లేదు పొండు సయిదోడులఁగూర్పుడు బందుకట్లనం
దందు సమర్థరీతి వివిధాస్త్రసమేతముగాఁగ మేలుసి
బ్బందుల నిల్పుఁ డీటెలను బాకుల లంగరుపల్గు లేటియి
బ్బందియు రానియట్లు పడవల్ సమకూర్పుఁ”డటంచు మాధవా! 96

చ॥ "విసురుడుకోలలున్ గొఱత్రవేట్లు బరుల్ కొఱముట్లుఁ బన్నియు
న్నసకలయుద్ధనౌకల రణస్థిరతన్ హవణించి సిద్ధమై
యొసఁగుఁడు నేనిదే తగినయోత్తర వచ్చెద చూత మెంతఁగాఁ
బసగలదోజలేచరము నైశమహాం"డని పల్కె మాధవా! 97

ఉ॥ ముదలఁగ్రహించి దాసవచమూపతులందఱు ధైర్యసాహసో
న్మాగలు ప్రసిద్ధనౌకల సమందగతిన్ జెలఁగించి వారిధిన్
బగాలుశతంబులై తనరఁ బన్నిరివ్యూహము లంతసోమకుం
డుఁ దఱలివచ్చె వేట యదనుంగనిసాగెడికోర్కె మాధవా! 98

శా॥ ఆనాఁ పెద్దమరేయి సద్దణఁగని రాజర్షిప్రధానుండు యో
గానందాబ్ధితరంగడోలికల నుయ్యాలూగుచుండన్ మునిం
ద్రానేకాకలితంబుఁ జోదితమునై యచ్చోటికే తెంచె హాం
సీనృత్యంబుల గొప్పనావ సుతనుశ్రీలొప్పఁగా మాధవా! 99

స్మృ॥ ఓడపైకి రావోయి! రాజర్షీ!
నేఁడు వార్ధి హవణించిపొంగెడున్
జూడు మేఘములు చుట్టె మింటిపై
గూడుఁగట్టె ననుకూయి మాధవా! 100

చ॥ చెన్నులఁబడంగ దానికి విశేషముగాఁ గనిపెట్టియున్న యో
గివరుఁడు కన్నులన్ దెఱచి కిల్బిషహారుల సర్వయోగిక
ప్రవరుల గౌతమాత్రిముఖభవ్యయతీంద్రులఁ గాంచి మించును
త్సవమున మ్రొక్కి యెక్కె గతసంభ్రమతిన్ గలమందు మా॥

సే॥ ఆరేయి వేఁగునెడ క్షీరాబ్ధిభంగముల హోరంతకంతకును దోరమై
ఘోరానిలంబు లతిచారాప్తిఁ ద్రోపులిడ సారాంబుదంబులిలధారలై
నీరమ్ములన్ గురియ దీరంబుపొర్లఁబడెఁ వారాకరంబెగసి యూరులన్
బూరించెఁ జెట్టులవిదారించె గట్లుపయిఁ బేరెంబువాతెవడి మాధవా

వృ॥ చిమ్మచీఁకటి ఫెళ్ళె ఛార్భటి జెదరు మెఱుపులు పొదలఁగన్
గ్రమ్మువారిధి కాఱుశీతము గగురయుదూఱసఁ జెలఁగుటన్
బమ్మెరన్నడుభూమి కొండలపయిపథములను వదలి నీ
రమ్ముముంచె సమస్తమున్నుచిరము వెఱుగుగతి మాధవా! 103

ఉ॥ కాదన కోహటించుతమకంబునఁ బన్నిన సోమకేంద్రునా
కాదళమెల్ల యుప్పెనఁ జికాకయి యొండొరుఁదాఁకి రాళ్ళపై
భేదిలి యాయుధంబులును వీరనికాయముతోడ వార్ధిలో
నేదెఁబ్రవాతవేగమున నింతయుఁద్రిక్కకయుండ మాధవా! 104

ఉ॥ కోరలుచన్నపామువలెఁ గొండొకయోజనఁదక్కి సోమ
కుం డారజనీసమానదివమందు దెసల్గనరామి మాయచేఁ
దోరపువెల్గుఁగూర్పఁ నటదోఁచె మహాఝషరాజు పోరిఁకన్
దీరదటంచు మత్స్యముగతిన్ దనువూని యతం డుమాధవా! 105

చ॥ కలియఁబడంగ "నోరి! తమకంబున వేదచతుష్టయంబుబ్రము
చ్చిలుటనుకొంటివో బ్రతుకుచింతయెయున్నజితోస్మియంచు నా
తొలిపలుకుంగముల్ వినతితోడుత వేధకొసంగుకానిచో
నిలువుముదిట్టవై యడఁతు నిన్నిపుడంటివి కాదె మాధవా! ॥ 106

చ। మునుపె ప్రచండవాతమున మ్రోతలరేఁగుసముద్ర మింకనుఁ
ఘనపథమంట గెల్పుతమకంబులఁ బోరినవెన్క వానిజీ
వనమును జీవనంబునకు వ్యాసమొసర్చి తదీయగుప్తవే
దనికరముఁ మునీంద్రులకుఁ దాల్మినొసంగితిగాదె మాధవా॥ 107

మ॥ ఇదిపౌరాణికగాథ మత్స్యమునకౌనే యిట్లుకావించుటు
త్త్రదిదైత్యుల్ దివిజుల్ శరించుట జలాంతర్గాములౌనావలన్
గదనంబున్ బొనరింప నీవటఁబనిగ్గల్పించుకొంచేగి యు
న్మదదైత్యాంత మొసర్చితంద్రు నిజమేమార్గంబొకో మాధవా! 10

# శ్రీ మాధవశతక కదంబము.

## తృతీయోపాయనము.

ప్రతిపద్య ప్రత్యేక రాగగర్భిత చౌషష్టికము,



ల సమృద్ధమై బహుళసేవకసంభరణైకదక్షమై
క్రాలుధరాపురంధ్రి సురకల్పతరుప్రథమించి సాక నా
మేలునఁ దృప్తినొంది కపమృత్యువుఁ గోరినయట్లు పెక్కుచా
దాల శఠింత్రు దుర్జనులు తద్దయుమూర్ఖతఁజిక్కి మాధవా! 1

ఉ॥ హృద్యవసంతకాలమధురీకృతకౌసుమగంధపూర్ణ సం
పద్యుతగంధవాహబహుమానితకేకిపికాదిరావగా
ద్గద్యముతోఁ బనీ భజనఁ గల్పనఁ జేసెదఁ బత్తిగొంపు మీ
పద్య మొకొక్కరాగమున వర్తిలు భక్తిరసంబు మాధవా! 2

ఉ॥ కన్నడఁ జేయుదేల? కడగండ్లనలంగురి తేఱలేక భూ
మి న్నరు లంతకంతకు భ్రమించుచు దుష్కృతు లాచరింపఁగా?
సన్నపుచెట్టు వంగనిది శక్యమె మ్రానగునాఁడువంప? నీ
పున్నము తేఁపుతేఁపనుచుఁ బ్రోద్గులఁ బుచ్చక రమ్ము మాధవా।

మ॥ సురటీ బ్రొంది యటం చనేకవిధవస్తుద్రావకంబు ల్పసుం
ధరఁ గల్పించితివేల? కామముఖవిన్యాసంబులే మూఢులౌ
నరుల న్మత్తున ముంచుచుండఁ గనవే నాస్వామి? గోర్పుట్టుపై
భరమౌ రోకటిపోటు చందమగుచు న్వర్తిల్లెడి న్మాధవా! 4

చ॥ బహుళరుచు ల్వెలార్చునొకపాకపుటుండకుఁ జీమలట్లు నీ
గృహమున నున్నగోళముల గిల్లుచునుంటిమి గ్రాసవాంఛ; స
న్నహనముమీఱి నెంతదినిన ?స్దలుగొందనిసత్సమృద్ధిఁ ద
ద్విహరణమిచ్చు నీదయకు విస్మయమయ్యెడు శ్రీరమాధవా!

ఉ॥ అక్రమముల్ హరింప సుజనావళిఁగావఁ బరాక్రమంబు ని
ర్వక్రకృపార్ద్రదృష్టియును వర్తిల నిందిరఁగూడి తార్క్ష్యుపైఁ
జక్రము శంఖము న్గదయు శార్ఙ్గముఁ జేతులఁదాల్చి నాదనా
మక్రియ నెంచఁదోఁచు పరమప్రభు నిన్నుఁ దలంతు మాధవా! 6

మ॥ త్రిజగన్మోహనమై కృపానిలయమై తేజోదురీక్ష్యంబునై
భజనీయంబయి దుష్టశిక్షణకళాప్రౌఢంబునై సర్వతో
విజయాఢ్యంబయి సర్వశక్తిమయమై వెల్గొందు నీ యాకృతి
న్నిజమా భక్తి స్మరింతు లోపముల మన్నింపంగదే మాధవా! 7

శా॥ తోడీవేయనినమ్మి సర్వమును నీతోఁ దెల్పఁగాఁబూనితి
న్నేఁడీపృథ్వి నిఁకొక్కఁడెవ్వఁడు మొఱాలింపంగ రక్షింప నా
వాఁడంచు న్ననుఁగన్నవాఁడనుచు సంబంధంబుఁగల్పించి ని
న్వేఁడ న్బాడఁగ నిచ్చకంబనక రావేసత్కృప న్మాధవా! 8

ఉ॥ మాటకుమాటకు న్మధురిమన్నటిపించు త్వదంకితంబులౌ
పాటలఁ దాళము ల్బహువిభంగుల మద్దెలధింధిమిధ్వను
ల్పాటిలఁ జొక్కి మూయుకనుల న్హృదిఁ దోఁచెడునీవిలాసమౌ
నాటకురంజిలె న్మన సనంతజగన్నటనాఢ్య! మాధవా! 9

మ॥ కవయ న్మాఁగెడుపైత్యరోగముల కాంక్షన్గొల్పు నానందభై
రవి యుల్లే మనస్సెల్లముంచుకొను విభ్రాంతు ల్భవన్నామసం
స్తవమూన న్జనునంచు నమ్మి దినము న్గావింతు నీపూజల
న్భవదవ్యాజకృపాకటాక్షతతి నింప న్రాఁగదే మాధవా! 10

మ॥ అరనేగుప్తిని ద్రవ్యము న్నిలవసేయ న్లోభులై యొండ్లకీ
యరు తాము న్భుజియింప రంత్యమునఁ దోడై వచ్చునే యీనిధు
ల్ధరఁ దాఁజేసిన పుణ్యలేశమునఁగాదా భావిసౌఖ్యంబు చే
కురు! మా నేరమిఁనోర్చి దిద్దఁగదె వైకుంఠాధిపా! మాధవా! 11

శా॥ కళ్యాణి న్వరలక్ష్మి నాత్మహృదయాగ్రస్థాయినిన్జేసి సా
కల్యశ్రీసుఖసంపదాప్తిని జగత్కళ్యాణము ల్కూర్చువా
త్సల్యం బేమని సన్నుతింతు జగదీశా! భక్తిమచ్చిత్తనై
ర్మల్యంబుం దయసేయుమయ్య కరుణన్మాకెప్పుడు న్మాధవా! 12

చ॥ మలహారమ్మై విభూతిమయమ్మై ఘనశాశ్వతసౌఖ్యదానవృ
త్తులఁ గడుదక్షమై జగతిఁ దోఁచుభవత్కరుణారసార్ద్రదృ
ష్టులకు జోహారులయ్య! యెపుడు న్నము నిడయ పోలి ప్రోచునీ
లలితతరానురాగబహుళప్రభకు న్నుతులిత్తు మాధవా! 13

చ॥ కలఁకలుదేఱుచిత్తమున గాఢతరంబగుభక్తి నుక్తి జో
బ్బిలహరి! పాపనిర్హరణవీర్య! సమస్తసుఖప్రదాసకో
మలహృదయాంతరంగ! యని మాటికి గానమొనర్తు నీయశో
విలసనము ల్ప్రపంచబహువీథుల కెక్కఁ జరింప మాధవా! 14

శా॥ బంధన్యాసివినీవ భాస్కరకరప్రధ్వస్తనీహారమ
ట్లంధత్వంబిడు సర్వబంధముల మాయం జేయుఁ ద్వత్పాదసం
బంధంబౌవరభక్తి, దివ్యనటన స్ఫూర్తించు నీభావస
ద్గంధామోదమె కాదె మా చెఱల రక్షల్కూల్పుట ల్మాధవా! 15

శా॥ 'ఆపద్బాంధవ! సంశ్రితావనదయావ్యాపార!' యం చెందరో
భూపాలాగ్రణులే వినమ్రులగుచు న్బ్రాజింత్రు నిన్నెప్డు డా
శాపానుగ్రహదక్షులైన మునులున్నాప్తోక్తి నిన్నెంతు; రా
శాపాశోపహతస్వభావులరు హెచ్చా! మాదృశు ల్మాధవా! 16

చ॥ గజముల మధ్యమావతికిఁ గష్టముకల్గునె? లెక్క కెక్కఁడా
ప్రజలమటంచు రా భయమువాఱునె నీహృదయంబునందు? వె
న్నుఁజఱచి యెట్టివారల ననుగ్రహదృష్టి భయంబుఁదీర్చునీ
కు జడుప! నమ్మఁ జాలఁ గనుఁగోదయసేయఁగదయ్య! మాధవా

ఉ॥ ప్రౌఢవరాళి ఫుల్లమకరందసమన్వితపంకజంబుల
న్గాఢతరాభిలాష నెమకన్ జనువైఖరి భక్తిగంధసం
రూఢశ్రితాంతరంగజలరుట్తతిఁ బర్వులువాఱు దీవట
న్బాధమనీషు లెన్నుకొనువార్తల నమ్మి నుతింతు మాధవా! 18

శా॥ కాలం బేగడపంగఁజాలుదునె నీకారుణ్యమే లేనిచో
నీలీల న్సుఖవృద్ధి సంతతముదం బీయంగ? నోయయ్య! నీ
జాలప్రాభవమో? మదీయజడతాసంప్రాప్తమో లౌక్య వా
ర్తాలగ్నంబగుబుద్ధిచే మఱతు నీతత్త్వంబు నోమాధవా! 19

ఉ॥ రోయకమాజుగుప్సలకుఁ గ్రోధములన్నినియుంగఁబోక న
త్యాయతమా కృపాగరిమ నారయుచుండెదు చంటిబిడ్డపై
మాయికిఁ గల్గుప్రేమ పయిమాటసుమీ భవదీయప్రేమ! నీ
కేయొక మాటుసేత రచియింపఁగలేముగదయ్య! మాధవా! 20

చ॥ మునుకొని శంకరాభరణముల్కడుఁబూన్కి నొనర్చి దుష్టవ
ర్తనులనడంచి లోకముహితంబొనఁగూర్చెద వెంతప్రేమయో
మనమున నీకుమాపయి! శ్రమంబొకటెంచవు చక్కనయ్య! ని
న్ననుకొననైనఁ జాల మహహా! కృతివిస్మరణంబు మాధవా! 21

మ॥ కనకాంభోజముల న్మణుల్పొదివి శృంగారంబురంగారఁ జె
క్కనహారంబు మనంబునన్దలఁచి యాక్రేవ న్నిను న్మానసా
క్షినిరీక్షించి శరీరమంతఁ బులకల్చెన్నొంద యోగ్యంబటం
చును నీకంఠమలంకరింతుఁ గళతేజుల్వాఁ నోమాధవా! 22

శా॥ పాలన్రావెదొ! పాదమున్నెదవొ! పన్నుండెదో! యాటల
న్నేలంబొ మెదొ మల్లరంగములకున్దేకించెదో! బిడ్డల
న్రాలింతో! మరులీలలన్మనఁగదో! నాతండ్రి! లోకంబన
న్నెళీరంగమనీకుఁ బాలువలభుల్కీరితు ల్మాధవా! 23

ఉ॥ సారవిహీనసంసరణసాగరసంస్థితి శక్తిమాయ సా
వేరికినైన మోక్షమగు టెంతయు నిక్కము; యెత్తుబడ్డపు
ట్టారగిలంగఁ దక్కినవి యూటుక ముక్కలఁగాళ్ళఁదన్ని చే
కూరుచు నారకప్రబలఘోరపరంపరలెల్ల మాధవా! 24

ఉ॥ వేకువయందుఁ బ్రాహ్మమున వీలగుచుం గుతుపంబులందు నెం
దాఁకలిఁదీర్చు హాయినిడిదాహమడంచెడు తావకీనసు
శ్లోకమునాకు, కాఫిఁగొని లోకము మించుచలాకినొందు న
ట్లోకమలాపతీ! హృదిమహోత్సుకతన్వెలయింపు మాధవా! 25

ఉ॥ లోకముఖారిరంసువులలోఁ గడుదిట్టవుగాఁగఁదోఁచు నీ
వీకడలేనిసృష్టి నెసఁగించుచునుండుట; నింటిచాలెగా
కేకళలబ్బ సంతతుల? కింతటనంతటనైనఁ దృష్టి నీ
కేకనుపట్టకున్న నిఁకనెవ్వరి నేమనవచ్చు? మాధవా! 26

శా॥ ఆభోగీంద్రములైన వ్రాలి గళమం దంసంబున న్మైన నే
శోభాపాదకమొక్కొ వానినె తమిన్జుట్టించుకొన్నాఁడ వా
లాభాలాభవివేక మేమెఱుఁగ మోలావణ్యసీమా! శ్రితు
ల్లాభీతిల్లుటకొక్కొ? సోదరులకు న్రాతాపులే? మాధవా! 27

ఉ॥ ఆశ్రితచక్రవాకహృదయజ్ఞ! మనోహరభానురూప! నీ
యాశ్రమముల్గదా దివి ననంతమమేయములైన సంఖ్యలోఁ
బ్రశ్రితరూఢిఁ దేలెడి ప్రపంచము? లన్నిఁటి నిట్లుసాక నీ
కేశ్రమసోఁకదే? కిటుకదేమి వచింపవె మాకు మాధవా! 28

ఉ॥ అధ్వగులై త్వదాశ్రితు లహర్నిశలు న్నినుఁ బాడిపాడి హం
సధ్వని నాలకింపఁ గడుమక్కువ యోగసమాధిఁ బూని రో
యధ్వరరూప! మానసమునందయిన న్వెలయింపవయ్య! యా
సాధ్వభిలాషతీఱ సరసంబగు వాగమృతంబు మాధవా! 29

ఉ॥ నీదర్బారున మంత్రులెవ్వరో? ప్రధానిత్వంబునం దెవ్వరో?
జోదుల్సైన్యపతు ల్భటాలములును న్సూరాళి యెవ్వారలో
యేదిక్కేమనొ నివురచ్చ? విషయం బేదో మహాచర్చకు
న్మాద్దైన్యంబునడంప నెవ్వరినిబంపంబూనెదో? మాధవా? 30

చ॥ నిరతము లోకసంభరణనిష్ఠల లోలతనుండు నీవు ని
ష్ఠురతపమూనుమానవులఁ జూచిన సిగ్గిలుదేమి? కానిచో
గురుతరవిఘ్నము ల్మొదటఁ గొల్పఁగ నేటికి? చేతఁగాక పై
న్బఱగున లొంగనేలతుది? పాశహనామ! వదాన్య! మాధవా! 31

ఉ॥ చేకొనియారభించినది చేయక మాలల ముక్కుమూసి యే
లాకొలమాలఁ? గార్యఫలమం దభిలాషఁ ద్యజించి మీవిధిం
గైకొన మేలటంచుఁ దొలిఁ గల్పనఁ జేసెదె విఘ్న? మాగక
ల్లై కడుదీక్షనిల్చినఁ గడిందిదయ న్వరమిత్తె? మాధవా!॥ 32

ఉ॥ రాగమె ముక్తిదారి జనరంజని సీకలరూపుఁ జూపువి
ద్యాగతి, సర్వసౌఖ్యపరమావధి, యెట్లన? గానవిద్యలో
రాగము, లోకవృత్తిననురాగమెగాక సరాగ మైహికా
రోగముల న్విరాగ మభియోగపరాగము భక్తి మాధవా! 33

శా॥ దేశాక్షీణజనానురాగముల నెందే మక్కువన్జిక్కి స
ర్వేశా! నాస్థితి విస్మరించెదవొ? తండ్రీ! నీవె యిట్లేమఱ
న్నాశాబద్ధుఁడ నైననాకు లభియింపంబోవునే ముక్తి నా
యాశాంకూరము వృద్ధినొంది ఫలమీయన్నాగునే! మాధవా! 34

ఉ॥ పున్నాగంబుల దండలల్లుకొని నిన్పూజింతునో? కేళిమై
పున్నాగంబుల నిన్ను నిల్పి దెసలంబోనిచ్చి యాడింతునో?
పున్నాగోరుదళాక్ష! యంచు దినముం బూజించి కీర్తింతునో?
పున్నాగప్రభువర్య! నీకయినయింపు న్దెల్పవే! మాధవా!॥ 35

శా॥ చేరంబాటి "ప్రసీదమే భువనవాసీ! సత్కృపారాశి!" య
న్వారి న్ఘోరముల్లెల్లఁ బాపి కరుణ న్పాలింతు వో దేవగాం
ధారేయు ల్నమకూర్చు కష్టముల కంతంబు ప్రసాదించి యీ
వే రాజ్యంబు సుఖంబుఁ బాండవుల కోయీ? పూర్వమో మాధవా!

ఉ॥ ఝుంకారధ్వనితోడ బంభరము లబ్జస్వాదుమద్యంబు నా
తంకంబు ల్కొన కారగించుక్రియ స్వాతంత్ర్యంబు నిండార నీ
యోంకారధ్వనితోడవచ్చి శ్రితభక్తవ్రాతమ్ముల్లచిత్తాబ్జపీ
ఠాంకస్వైరవిహార మూనఁగదె స్వాస్థ్యప్రశాంతితో మాధవా! 37

శా॥ ఆ సావేరిడియుంగఁ బోక సెలలేయన్నాగు హృద్భూమి న
న్నోనొసారు ల్మొదలంటఁబోయెనని యేనూహించిన న్జిక్కకే
మోసుల్వారుచు జేకు లెత్తుకొని యుబ్బన్జూపుఁ దండ్రీ! తదా
యాసం బెట్లుకథావశేషమగునయ్యా! తెల్పుమో మాధవా! 38

శా॥ శాతఘ్నిస్వన మిచ్చగించెదవొ? ఝుంఝూటీధ్వని న్మెత్తువో
కోకో? తీర్థాధిపుహోరుఁ గోరుకొను దాకో? విశ్వరూపంబుచే
నేత్రద్రోదసినిండునీకుఁ దగుతానే భృంగరాణ్ముఖ్య సం
జాతోక్తు ల్నినుఁదేర్పఁజాలుస్వరవిస్తారం బెదో? మాధవా! 39

ఉ॥ గౌళికె భావిసూచనను గల్పనఁ జేసితి మానవుండు నీ
పాళెమునందు మేటియగువాఁడయిన క్షణమందు వచ్చు నే
ష్టోళెముఁ బొల్పలేఁ డిదియె పో భవదుజ్జ్వలసృష్టిరీతి, యే
తాళమొ. యెట్టిరాగమొ? ప్రతారణముల్తగునయ్య! మాధవా! 40

శా॥ ఔదార్యంబున కున్కపట్టయిననీహర్యక్షువక్షంబున
జ్జేఁదోడైచు వసించుమాజనని శ్రీసింహాద్రమధ్యాదయా
ప్రాదుర్భూతవిశేషసంపదలు భూభాగంబుల న్నిండుటం
గాదే మాకుఁ గొఱంతలేని సుఖము ల్కామప్రదా! మాధవా! 41

శా॥ ఆవాచస్పతికైన నీబహుళమాయాసర్గము ల్తేటగా
భావింప న్వచియింపలేఁడనినఁ దత్ప్రస్తావము ల్మాకు? సృ
ష్టివైచిత్ర్యములం దనంతకళల స్సృంగారముల్చిల్క నీ
కన్ను ల్కాంచి ముదంబుపెల్లెగయుతుష్టి న్గల్చెద న్మాధవా! 42

చ॥ భవదభిమాన మిం దమృతవాహినిగాఁ బ్రవహింపఁగాదె మా
నవహృదయావివేకకలనాజనితాఖిలచిత్తఘాతము
ల్నవరణఁజెంది నూత్నజవసత్వముల న్వికసించుచుండు ను
త్సవములఁ దద్భవంబులు విశాలదయాహృదయాఢ్య! మాధవా !

చ॥ అన యిటు లంత మీ దనుటకందక పాటెడుకాల తీవ్రవా
హిని నడిసీమ నీకు క్షణమేనియుఁగాని యొకింతలోనె పు
ట్టి నెగడి తీఱువారలు కడిందిముదంబిడుసృష్టిఁ దుష్టిమోఁ
దనియక దాని మాయయనితారుట దుర్గతిగాదె మాధవా! 44

చ॥ అమృతతరంగిణు ల్భవదపాంగముల జ్జనియించి స్వప్రవా
హముల ననంతలోకనిచయంబులపైఁ బరగించి నేత్రప
ర్వములుగ సర్వసౌఖ్యపరిపక్వదశాధ్యులఁగా నొనర్చు నా
గ! మిగులు దీనికంటె నితరంబులఁగల్గునె మాకు మాధవా! 45

ఉ॥ పుట్టుటదేనికో? తలఁగిపోవుటదేనికొ? తత్ప్రసంగము
ల్పట్టవుమాకు నిత్యసుఖవర్ధక సృష్టికళావిచిత్రము
ల్గట్టిముదంబుఁగూర్చి తమకంబుల దేఁపుచునుండఁ జిన్మయి
న్నట్టువఁజూపునీప్రకృతినర్తన మేల్తగుతోట మాధవా! 46

మ॥ ఇవసంఛాదన దీర్ఘరాత్రివశమై యెన్నాళ్ళకెన్నాళ్లకో
రవితోఁపన్గలదేశమధ్యమునఁ దద్రమ్యత్వము జ్జూడకే
రవిలోమచ్ఛల దుర్భిణీస్ఫుటపి పాటఁజూచువాఁడట్టు లు
త్సవకృత్సృష్టిని వీడి భోగి పరచింతన్ప్రక్కనే? మాధవా! 47

మ॥ బహుపంథల్ గలవండ్రు నిన్నుఁగలియన్ భావింప నా కొక్కటే
స్పృహఁగన్పట్టు ననన్యమైన హృదయోద్వేగంబు తత్ప్రాప్తి ని
స్పృహనో! భక్తినొ! వైరవృత్తినొ! మఱెంకేదైననో యైననే
మి? హృషీకేశ! సమస్తభావవిపులోర్మిదోలితా! మాధవా! 48

మ॥ పులుగుల్ శ్రేయుకలస్వనంబులకు సంభోరాశిసంభూత సం
కులకోలాహలనిస్వనంబుల కనుంగుంబిడ్డల న్గోఁచు ని
ర్మలినావ్యక్తకళాకలాపములకు న్మందానిలప్రాప్తకో
మలరావంబుల కన్యము ల్సుఖసమాంశ న్నిండునే? మాధవా! 49

మ॥ కలహంసేంద్రియసౌఖ్య మీఁగలుగు నీకమ్రత్వసంపూర్ణసృ
ష్టుల నానందముఁగూర్చు నాయవయవస్తోమంబు లున్నప్డె త
త్కళఁగైకో కదిసత్యమంచుఁ దెలియంగారాని దేనెంతునే?
కలదే? మబ్బులనమ్మి కూపముఁ గడంకన్బూడ్చుట? ల్మాధవా! 50

శా। నాప్రాణానకు నీప్రపంచము మహానందంబు నీఁజాలు స
త్యప్రేమాఢ్యముగాఁ జెలంగెడి తదీయాణుస్వరూపంబుల
న్నిప్రౌఢత్వము నీమనోజ్ఞగతియు న్నీరూపు బింబింప మా
యాప్రాప్తంబని యీసడించు టెటులయ్యా! శ్యామలా! మాధవా!

ఉ॥ ఒక్కటఁగాకయున్న మఱియొక్కటనైనను నీవుమెచ్చు స
మ్యక్కృతి సల్ప హస్తముఖరావయవంబు లెసంగునప్డెకా
కక్కట! 'సర్వమిథ్య' పఠమాని గతించిన వెన్క యాతనం
జిక్కిన నౌనె? యిప్డె కృపిఁజేసెద భక్తిఁ ద్రిమూర్తి! మాధవా!52

చ॥ కరములు సాధుసోదరనికాయసుఖాస్పదకార్యసాధనో
త్కరములుగాక కేవలభవద్భజనాంగకతాళధట్టనా
చరణపరంబులేయయిన సాకృతి సృష్టినెసంగు నీపదాం
బురుహముపూర్ణపూజఁ గనఁబోలునె? మంజులపాద! మాధవా!53

చ॥ చరణము లార్తపాంథజనసద్మతలాభిగతి న్జరింప కు
ర్వర భజనాంగనాట్యముఖరంబులఁ జిందులఁద్రొక్క సాకృతి
న్ధర నిరవొందు నీగురుపదంబును బూర్తిగఁ బూజసేయు తు
ష్టి రహిఁజనించునే? లలితసింధుసముద్భవపాద! మాధవా! 54

ఉ॥ నాస విరోధిషట్కపవనప్రతతి న్బసిపట్టి యజ్ఞతాం
హోమాసునిబద్ధమూఢజన మోహాపరిచ్యుతిఁ గూర్ప కూఱకే
కాసునుగాని వాసనలకై భజనక్షితి ధూపదీప వి
న్యాసమొనర్ప సారమతినబ్బునె పూర్ణఫలంబు మాధవా! 55

ఉ॥ కష్టవ దుర్విలాసములఁగాంచి భ్రమించి విపత్పయోనిధి
న్మగ్నెడువారిపైఁ బఱపి ముప్పిడలి చురహోమార్తిఁ దేటమా
టెన్నుచుఁ జెప్పకే భజనదిక్పటబద్ధత్వదీయరూపమున్
గన్గొనుచూడ నీకొలు వఖండితపావని కాదె? మాధవా! 56

ఉ॥ శ్రోత్రము లగ్ధదేహాగునాశోభఁ దెలంగనివారి మూలుగే
మాత్రమొసంగెస న్నిని శ్రమంబని తోల్గక తద్విముక్తికై
సూత్రముఁజూడకే భజనఁ జొప్పడునాదము లానుచున్న స
త్పాత్రత నిండెఁ? మోక్షవరవర్గనియేపథిఁ జేర! మాధవా! 57

ఉ॥ యోజనము ల్వదంగలలితోజ్జ్వల లక్షణఁ బ్రాతినిధ్యత
న్రాజిలు స్వప్నభేదముల గక్షణపై వెలయించి స్రష్ట క
వ్యాజతఁ దోఁచునీసకలాంగకపూజ నొనర్పఁబోక నీ
రాజనము న్ప్రసాదమును రాఁ దమకించుచు భక్తిమండలి
న్జేజుఁ గూరుచూడఁ గలదే చిరసౌఖ్యమునాట? మాధవా! 58

చ॥ దాసగులఁదోలుసూత్రమును దోడులతో వచియింప కెప్పుడు
ప్రసన సురాగభక్తి పరిరంభితగీతముఁబాడ సత్సుధా
రసకరకాయితంబయి ధరన్గగు నీచరణాంబుజంబు మే
ల్పసగిలస్పృష్టి నిచ్చునె తపస్వినియై చనుగాక మాధవా! 59

మ॥ భవవిచ్ఛాలవజాతపాలితదయాంభఃపూర మాపూర్తి ను
త్సవకృద్భక్తరామృతద్రవ మహాసారంబుగా సర్వభూ
త విలాసంబుల స్పృష్టిపై వెలసి సత్యాత్తోరుసౌఖ్యంబిడ
న్దసమాత్రంబును లేమియుండునె మహానందస్థితి న్మాధవా! 60

శా॥ ఆపాదంబు దయార్ద్రసంబంధుగు నీయం దూరుదాక్షిణ్య స
త్కూపారంబు సమస్తలోకములపైఁ గుల్య ల్నదు ల్వార్ధులై
వ్యాపాద న్నమియింపరాని యఘము ల్దోషంబులుం గల్గునే
శాపంబు ల్వడిడిందవే నిగమసంచారీ! హరీ! మాధవా। 61

మ॥ కనకాంగీన రుచీవిశేషములు సంగప్రాప్త నీలాంబుదా
యనతేజంబును జంద్రసూర్యకృత నేత్రాలోకము ల్వక్షమం
దున శ్రీవత్సకళాకలాపములు నెంతోదీప్తి లోకంబులం
దు నవశ్రీయుతరత్నకాంతులను సంతోషంబిడు న్మాధవా! 62

ఉ॥ రాగములన్నియు న్సురుచిరంబులు లక్షలుఁగోట్లు దేవభూ
రాగవిశేషకల్పిత నిరంజనరంజకము ల్సుధార సో
ద్యోగకళాన్వితంబు లెలతోషకము ల్వచియింపనౌనె? యా
యీగతి మేళకర్తులనచించితి నాకుతి తీఱ మాధవా! 63

ఉ॥ ప్రస్తరితస్వరప్రచయభాసితనారదగానరీతి యో
శస్తగభీరరాగబహుచాలితతుంబురమూర్ఛనాళి యో
నిస్తులితస్వభావపరిణీతశుభోభయసాహితీకళా
ప్రస్తుతియో! తృణంబిదికృపన్గొను మేరుపుగాఁగ మాధవా! 64

---

తెనాలి శారదా ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె 1935.

# తప్పొప్పుల పట్టి.

| పేజి. | పంక్తి | తప్పు. | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 7 | నాడెదవొకే | నాడెదొకటే |
| | 14 | సంస్కృతీ | సంస్కృతిన్ |
| 7 | 25 | ఱెండ | రెండ |
| 9 | 25 | మున్నగునె | మేలయగు |
| 10 | 21 | ఉవిదా | యువతీ |
| | 26 | గాఢే | కొల్వే |
| 11 | 1 | తేనియు | తేనిను |
| 12 | 7 | తోటి | తోడి |
| | 8 | తరయు | తరము |
| | 19 | ణాముజి | ణామున్ |
| 15 | 8 | యశశ్వ | యశస్వీ |
| 17 | 19 | స్వంత | స్వచ్ఛ |
| 18 | 18 | సుషిమా | సుషమా |
| 19 | 23 | ప్రళ | విల |
| | 25 | కఱఁగు | కరఁగు |
| 20 | 16 | తీఱే | తీరే |
| 21 | 17 | జక్కెఱ | జక్కెర |
| 23 | 8 | కొరకు | కొఱకు |
| 25 | 1 | ట్టులగాక | ట్టులుగాక |
| | 18 | రానూ | రాన్ |

